# గడుసు బిడ్డ

[తప్పిపోయిన కుమారుడు]

(నాటకము)



⁂

రచయిత:

పిడపర్తి ఎజ్రా

పిడపర్రు

1973

## ఇందు పాల్గొను పాత్రలు

| | | |
|---|---|---|
| 1. | సుజనమూర్తి (తండ్రి) | 50 సం॥ర |
| 2. | సౌజన్య (సుజనుని అంతరంగికుడు) | 50 ,, |
| 3. | ధీరోదత్ (పెద్ద కుమారుడు) | 25 ,, |
| 4. | ప్రదీప్ (చిన్న కుమారుడు) | 20 ,, |
| 5. | దుష్టబుద్ధి (దుష్ట స్నేహితుడు) | 20 ,, |
| 6. | దాక్షిణ్య ( ,, ) | 20 ,, |
| 7. | పిట్టి (పందుల యజమాని) | 40 ,, |
| 8. | తారక (వేశ్య) | 20 ,, |

# కృతి ప్రశంస



సీ॥ పేదకు బొక్కెఁడు మెతుకులు పుట్టక
అధిక ధరలతోడ అలమటించ
జిహ్వాకింపగు వంటచేసికొనుట కింత
నూనెచిక్కఁక ప్రజ నొచ్చుకొనగ
పేదల రక్తంబు పీల్చుచు ధనికులు
మేడపై మేడలు మెరయగట్ట
భిక్షగానికి పైస ప్రియమారవేయక
కలవారు ఈనాడు కలతపడుచ
ఆ॥ "గడుసుబిడ్డ" బ్రతుకు కడగండ్ల పాలైన
విధము విప్పిచెప్ప విత్తమిచ్చి
ఆదరించియుంటి వమితంబుగానన్ను
జాషువ ! గురుదేవ ! సద్గుణుండ !

ఉ॥ ఆడినమాట తప్పవు దురాశలచెంతకు చేరవీవు జో
గాడిన పేదకున్మిగుల కమ్మని బుద్ధితొ ధర్మమున్ మహా
వేడుకగా నొసంగెడి వివేకుడ ! జాషువ ! నిష్కళంకుడా
పాడియుపంటయు న్గలిగి వర్ధిలు పేదల నాదరించగన్ !

ఉ॥ ఐక్యము కల్పుగోలుతన మద్భుతరీతిని మీ కల్వడగా
వాక్యము నుగ్గుగా కుడిపి భక్తితొ సాకిరి పౌలు మేరియున్
శక్యముగాదు సుమ్మి ! నరజన్మల నవ్విధి తీర్పుదిద్దుటల్
"వాక్యము శక్తిగల్గినది" వాక్యమె జీవము మానవాళికిన్.

ఉ॥ రెక్కలు ముక్కలై పగలు రేయనిచూడక తల్లిదండ్రులా
చిక్కనజాతిలో మునుపు సేద్యపుభూమిని కూర్చియుంచె మీ
యక్కర గుర్తెఱింగి తమ యక్కరమానియు దూరదృష్టితోన్
చిక్కులులేక మీ బ్రతుకు చేరును గమ్యము భక్తవర్యుడా!

ఆ॥ హూణ విద్యలోన ఉన్నతంబుగ నెగ్గి
పలుకనేర్చినట్టి పండితుడవు
అల్పమెఱుగనట్టి అధ్యాపకుడ వీవు
క్రొల్లెగడ్డ వంశ కోవలోన.

ఆ॥ కల్లబొల్లిమాట లల్లిబిల్లిగనల్లు
అతిశయోక్తులనిన అంటనీవు
స్వామిభక్తి యనిన సత్యవాక్కు లనిన
హత్తుకొందు వెప్పు డాదరమున.

సీ॥ ఉన్నత విద్యలన్ మిన్నగా చవిజూచి
సరదాగ నెగ్గిన "చదలవాడ"
కళలు మిన్నగనేర్చి ఘనతవహించిన
చల్లనివాడలే చదలవాడ
భక్తిలో విద్యలో శక్తిలో మాటలో
సడలనట్టిదివాడ చదలవాడ
వాసికెక్కిన మంచి వక్తలన్ గనినట్టి
చక్కని జనవాడ చదలవాడ
ఆ॥ ప్రభువు భక్తిలోన బాగుగా వర్ధిల్లి
ఘనత గాంచినట్టి ఘనులవాడ
అట్టి చదలవాడయం దుద్భవించిన
జాషవ! మహనీయ సజ్జనుండ.

ఆ॥ చదలవాడ యనెడి చల్లని నింగిని
రాజరాజువోలె రాజిలంగ
ఉద్భవించియుంటి వద్భుతంబుగ నీవు
భక్తి యనెడి కాంతి ప్రజ్వరిల్ల.

ఆ॥ ప్రభువు మార్గమందు పయనించి ముక్తిని
పొందనెంచినట్టి పూజ్యురాలు
భర్తకన్నమిన్న భక్తిలో మరియమ్మ
పతికి తగినపడతి భాగ్యరేఖ.

ఉ॥ బిడ్డలు వృద్ధియై భువిని పీడితజాతికి సేవజేయగా
అడ్డుగ నిల్చినట్టి మన ఆర్యులపూర్వపు దుష్టశాసనాల్
గ్రుడ్డిగ నాచరించక అకుంఠిత శక్తితొ కూల్చివేయ నీ
బిడ్డల నంకితం బొసగు ప్రీతిగ జాతికి సోదరీమణీ!

ఆ॥ ధర్మపథమునందు 'దర్గాగ' వర్థిల్లు
కలిమి బలముగలిగి ఘనతనొందు
ప్రభువు మార్గమందు పయనించు మరియమ్మ
"పారడైసు" నందు ఫలముబొంద.



# సంస్మరణ

సీ॥ ఏ క్రొత్తలోకాన ఎచ్చోట నుంటివో
జాడతెలియదాయె సాధ్విమాకు
ఏకారణంబున ఈనేల విడనాడి
ఒంటిగా నునువీడి యుంటివమ్మ
ఎవ్వరడ్డుకొనిరి ఏకారణంబున
ఇంటిమాటమఱచి యుంటివీవు
బంధువర్గములెల్ల బహుదూరమాయెను
ఇల్లువిడిచినీవు వెళ్ళినంత

ఆ॥ కలవరించుచుండె కన్నబిడ్డలు నిన్ను
చిక్కులందుచిక్కి చింతతోడ
కన్నతల్లిసాటి కనకమైనను రాదు
మార్గమున్న రమ్మ మరువకుండ.

ఆ॥ విద్యబడసిరమ్మ విరివిగా బిడ్డలు
లేమిలెక్కగొనక లేశమైన
నీవు బ్రతికియున్న నిజముగా ఎంతయో
మురిసియుందువమ్మ మురిపెముగ.

ఆ॥ బంధువర్గమెల్ల బహుదూరమైనను
శారదాంబ నన్ను చేరదీసి
కష్టసుఖము లరసి కాపాడుచుండెను
మరువబోకు మమ్మ పద్మనమ్మ.

★

# ఒక మాట



కథావస్తువు కరుణమయం. మూలం బైబిల్. చెప్పినవాడు కరుణమూర్తి శ్రీ యేసుక్రీస్తు. దీన్ని నాటకరూపంలో అల్లిన వారు ఆంధ్ర క్రైస్తవుల చిరపరిచితుడు శ్రీ ఎజ్రాకవి. ఇంకేం కావాలి?

'ఎజ్రా'–హీబ్రూ పేరు. దీని అర్థము 'సహాయకుడు' క్రీస్తు యేసు చెప్పిన ఈ కరుణరసభరిత కమనీయోపమానాన్ని నాటకీకరణచేసి అనేకులు ఈ దైవప్రేమ సందేశాన్ని జీర్ణం చేసికోడానికి సహాయపడ్డారు కవిమిత్రులు మన ఎజ్రా. బైబిల్లోని ఎజ్రా ఒకశాస్త్రి. ఈ ఎజ్రా ఒకకవి.

'స్వయం ప్రకాశం కలది కళ' కళలో అనేక ప్రక్రియలున్నాయి. వాటిలో ఒకటి నాటకం. దీనిలో మళ్ళీ శ్రవ్యమని దృశ్యమని చిలువలు పలువలు. 'గడుసుబిడ్డ' ఒక మంచి సాంఘిక దృశ్యనాటకం. తన కవితామాధురిని, ఊహాచాతుర్యాని ప్రయోగించి మాతృకకు నాటకహంగులు దిద్దాడు రచయిత. కాని సందేశం మారలేదు. గురితప్పలేదు. ఆశయం పెడదారిత్రొక్కలేదు. ఎజ్రాకవిగారిని అభినందిస్తున్నాను. ఈ కృషిలో వారు కృతార్థులయ్యారు.

మంచి నాటకాలు లేవని ఆంధ్రక్రైస్తవ యువకులు తహతహలాడుతున్నారు. ఈ సవాలును చేపట్టి ఎజ్రాకవివంటి

ఉత్సాహవంతులు, అభ్యుదయ కాముకులు ఈకొరతనుతీర్చాలి. నాటకీకరణకు పనికివచ్చే ముడిసరుకు బైబిల్లో పుష్కలంగా వుంది. కేవలం బైబిల్ కథలకేకాక దైనందిన జీవితంలో సామాన్యవ్యక్తి ఎదుర్కొనే సామాజిక సమస్యలపైనకూడ తమ చింతనను కేంద్రీకరించి ఆంధ్ర క్రైస్తవ నాటక రచయితలు తెలుగుగడ్డను తీర్చిదిద్దాలి. కమ్మని కైతల పన్నీటిజల్లులతో హాయ్ హాయ్ అనిపించే కవితాపటిమ, అనంతమధుర సందేశాలను అనర్గళంగ గుప్పించగల కలాలు క్రైస్తవ సమాజంలో కోకొల్లలు.

'గడుసుబిడ్డ'ను పరిచయం చెయ్యడం నాభాగ్యం. సర్వ కృపానిధి-ఎజ్రాకవి సాహిత్య పరిశ్రమను దీవించి వర్ధిల్ల జేయాలనే,

ఆశీస్సులతో

గుంటూరు
ఆగస్టు 6, 1973

(రెవ.) డి. వి. డానియల్, ఎమ్.ఏ.
ఏ. ఇ. ఎల్. సి లిటరేచర్ సెక్రటరి.

# వేడికోలు

దైవానుగ్రహమువలన కొన్ని కావ్యాలు వ్రాశాను. ఏదో ఆశక్తి, ఉత్సాహము లేనిదే ఏపని చేయలేము. బైబిల్ సంబంధంగా వ్రాసిన నాటకాలకు ఆర్థికపుష్టి చిక్కకపోయినా ఏదో ఒక ప్రేరణవలన వ్రాశాను. ఇక అచ్చుకావడానికి దైవ సంబంధమైన వ్యక్తులు దొరికితే తప్ప వాటికి ప్రోత్సాహం చిక్కదు.

అట్టివ్యక్తి శ్రీ కొక్కెలగడ్డ జాషువాగారు దొరకటం నా అదృష్టం. వారి వితరణవలననే ఈ కావ్యము మీ ముందుకు రావడానికి అవకాశము చిక్కింది. నామీది వాత్సల్యముకొలది మాటజారి ఆ దంపతులు విశ్వాసులైనందున నాటకాలను ఈ విధంగా ప్రోత్సహించడము మంచిది కాదని భయపడి సగం ముద్రణ అయిన తరువాత సంశయం వెలిబుచ్చారు. కాని ఆడినమాట తప్పడం మంచిదికాదని వారే నిబ్బరపడి తమ ధర్మాన్ని నెరవేర్చారు. ఇక కావ్యము అన్ని హంగులు దిద్దుకొని మీ ముందుకు వచ్చింది.

కావ్యాలు తీరుబడిచిక్కినపుడు కూర్చొని ఎన్నైనా వ్రాయవచ్చు కాని వాటికి పరిచయాలు పరిపక్వాలు కల్పించాలంటే రచయిత కొంత బాధపడాలి. ఇది ఒకవిధంగా బాధే. కావ్యము ముద్రణ ముగియాలి, అభిప్రాయాలు వ్రాయాలి అంతవరకు ప్రెస్‌లోపని ఆగిపోవాలి పరిచయాలు వ్రాయమని పెద్దలను ఆశ్రయిస్తే గడువులు అందాపొందకుండా పెడతురు కాని నాకు అత్యంత ఆప్తులు అభిమానులైన రెవ. డి. వి. డి. గారు అలాంటి షరతులు విధించకుండా అడిగిన వెంటనే వల్లెయని కావ్యాన్ని పఠించి వారికి తోచిన భావాలు వ్రాసియిచ్చారు. అందుకు వారికి కృతజ్ఞుడను.

అంతేకాదు దానియేలుగారు నాకొక పెద్ద ధనాగారము. ఆపదలో అడ్డుపడిన అత్యంత ఆప్తబాంధవులు. క్రైస్తవ రచనలు పరాయి మార్కెటులో చలామణీకావు. ప్రజలా ఆదరించడం తరుగు కేవలం రచనే ఆధారంగా ఉన్నరోజుల్లోవారు లూథరన్ పబ్లిషింగ్ హౌస్ యజమాని, నాకావ్యాలు ఎన్నో కొని వారి చేతిమీదుగా ఎన్నో చెక్కులు వ్రాసి యిచ్చి నన్ను కృతార్థుని చేశారు.

కాని మాటమాటే. డబ్బుడబ్బే. మాట లెంతకటువుగా ఉంటాయో మనసు అంత మెత్తనిది అయినా తన సంస్థకు యిటు రచయితకు లాభదాయకంగా మెలిగారుకాని తన విద్యుక్తధర్మాన్ని విస్మరించే వ్యక్తులుకాదు. 'కృషితోదుర్భిక్ష నాస్తి' అను నానుడి వీరిలోనే చెల్లుబాటు. కొద్దిపాటి పాదిరిగారుగాకుదిరి *M. A.* పట్టంపుచ్చుకొని లిటరేచరులో యింత ప్రావీణ్యం సంపాయించారంటే యిక వారికి వారేసాటి. అట్టి దక్షతగలవారిచేతిలో లూథరన్ పబ్లిషింగ్‌హౌస్ లేకపోవడము నాబోటి రచయితలకు తీరనిలోటు. దేవుడు తన కావ్యాన్ని ఎవరోఒకరుద్వారా అందించకమానడు. అట్టి ప్రభుభక్తిపరాయణులైన రెవ. వి. డానియెల్‌గారికి నా నమోవాక్కులు.

కథ బైబిలుదైనా ఆధునిక స్థితిగతులకు జోడించి వ్రాసినందుకు ఇది పౌరాణికమా లేక సాంఘికమా అన్నమీమాంసకు తావీయక ఈదైవోపదేశాన్ని నటకులు ఎల్లెడల ప్రదర్శించి అందరు సత్యమును గుర్తెరిగి మేలుపొందునట్లు చూడ ప్రార్థన.

కొలకలూరు
ది 7—8—73

ఇట్లు
— రచయిత

# గ డు సు బి డ్డ

## ప్ర థ మా ం క ము

[ఇంటి వరండాలో కుర్చీలు, బల్లలుండవలెను. గోడకు ప్రకృతి సౌందర్యమును తెలుపు పటములుండవలెను. సుజనమూర్తి కుర్చీపై ఆశీనులై విచారముగా కూర్చుని యుండును. సౌజన్యలోపలినుండి ప్రవేశించి మౌనముగా కూర్చుండి ముఖము తేరిచూచి]

సౌ: మహాప్రభూ! మనకు ధనధాన్యములకా...లోటులేదు. శక్తికొలది దానధర్మములు చేయుచున్నారు. తమ సతీమణి వియోగము తప్ప మనకు వేరే లోట-టూ లేదుగదా! మరి తమ మనోవ్యధకు కారణమేమియో తెలియకున్నది. (సావధానముగా అనును)

సు: సౌజన్యా! యదార్థమునే వచించితివి కాని...

సౌ: ఏమిస్వామీ! కాని యని నిట్టూర్పు విడిచితిరి?

సు: నా మనోవ్యధను ఏమని వివరించను సౌజన్యా! (విచారముగా)

సౌ: సత్ప్రభూ! పొరబడుచున్నారు. ఈ సాలుకు సశ్యములు పుష్కలముగా ఫలింప ధాన్యపుకొట్టు లన్నియు వెలితి లేకుండా నింపితిమి.

సు: నిజమే! కాదనను కాని సౌజన్యా ...

సౌ: మరి తమ మనోవ్యధకు కారణము? పశువుల అభివృద్ధి కుంటుపడినదనియా?

: లేదు లేదు ఆ జగన్నాటక సూత్రధారి వాటి అభివృద్ధికి కూడ చాలినంత చేయూత నిచ్చియున్నాడు కాని . . .

: మరి పనిపాటలలో పాలేరులు కలసిరావడము లేదనియా?

: లేదు లేదు.

: వారి వసతికి తగిన వసరులు కల్పించ లేకపోతిమనియా ?

: కాదు ! కాదు !

: వ్యవహార కార్యక్రమములయందు మిమ్మెవ్వరైనా తూల నాడి యున్నారా ?

: లేదు లేదు అంతటి దౌర్భాగ్యపు స్థితికి నేను దిగజారి యుండలేదు.

: (ప్రక్కకు జరిగి తనలోతాను) ఏమీ ! ధనధాన్యము లకా లోటులేదు. మందిమార్బలమునకా వెలితిలేదు కలిగిన సిబ్బందిని కన్నతండ్రివలె కాపాడుచున్నారు. పశుగణాభివృద్ధికి లోటులేదు. వ్యవహార కార్యక్రమములయందు తలవంచని వీరుడు. ఇతరులవలె పరులసొత్తు కాశించు ప్రలోభికాదు. ఏనాడు యింత చింతాక్రాంతులై యుండుట నేను కాంచియుండలేదు. ఇంతకీ వారివంతకు కారణమేమై యుండునబ్బా ! (ముందుకు వెళ్ళి) మహాప్రభూ ! సంతానోత్పత్తి తగినంత లేదని తమకు విచారమా !

: లేదు సౌజన్యా ! సంతానప్రాప్తి కలిగినంత మాత్రాన మనము ధన్యులము కాదు.

: సంపన్నమూర్తీ ! మీమాటలలోని వాటమును గమనింప నాకు చాల ఆశ్చర్యము కలుగుచున్నది. ధనవంతు

నకు కావలసిన సంఖ్యలోనే పుత్రరత్నముల నొడగూర్చి యున్నాడు. ఆ భగవంతుడు.

సు : ఔను. ఆసర్వాంతర్యామి దయామయుండు కరుణాశీలి ఏ ప్రాణి కెయ్యది అవసరమో అయ్యది ఆ సమయములలో సమకూర్చి పెట్టుచునే యుండును.

సా : అయితే దాని ననుభవించు విధానలోపమువలననే తత్ఫలము ననుభవించు అవకాశమును జారవిడుచు చున్నామనియా మీయూహ ?

సు : ఔ నవును. సర్వమును సృష్టించి మానవున కనువగు దానిని యిచ్ఛగించిన దాని ననుభవించమని స్వేచ్ఛ నిచ్చి యున్నాడు. ఆ భగవానుడు,

సీ॥ నరులను ప్రేమించి నవధాన్యములగూర్చి
సంతృప్తి పరచుచు సాకుచుండ
మరకత మాణిక్య మణులను సమకూర్చి
సృష్టికే వెలుగును సిద్ధపరచ
తనకన్న మిన్నగా ధరణిలో బ్రతుకంగ
సౌభాగ్యములనిచ్చి సాకుచుండ
పలువిధ ఫలముల పలుభంగులను గూర్చి
తనివిదీర గుడువ ధరణికొసగ

ఆ॥ పవలు రాత్రినేల భాస్కరచంద్రులన్
పృథ్వికొసగియుండ ప్రీతితోడ
అట్టి కరుణామూర్తి నాడిపోసికొనుట
పాడియగునె మనకు భవ్యమూర్తి.

గాన సకల ప్రాణులను సంరక్షించు ఆ సృష్టికర్తను నే నే
మని పరుషోక్తము లాడుదు. తప్పొ తప్పొ మనదోషము లే
మన ద్వైతమునకు మనకు అడ్డుగా నిలిచినవి.

సా : ఆహాహా! బహుచక్కగా వచించియుంటిరి. "ఆడ చేత
గాక మద్దెల ఓటిది" యను లోకోక్తి యిప్పటైన చక్కగా
తగియున్నది. ఆసృష్టికర్త అద్భుతలీలలు తమరు వర్ణించ
నా మనసున కానందముగూర్చినవి. అంతియేగాక,

సీ॥ మట్టిముద్దనుఁ దీసి మానవజాతిని
సృష్టించియున్న విచిత్రమూర్తి
సశ్యసంపదలెల్ల చక్కగా భువినుండి
సృష్టించి మనకిచ్చు జీవదాత
భూగర్భమున నీరు పూర్తిగా సమకూర్చి
జీవరాసులసాకు పాలనుండు
రంగురంగుల పూలు రమ్యంబుగ భువిని
సృష్టించి మనకిచ్చు శ్రీకరుండు

ఆ॥ మంటినుండితీసి మంటికే మనమేను
అప్పగించునట్టి ఆదివేల్పు
అట్టి పుణ్యమూర్తి నవనిలో శ్లాఘించ
శక్యమగునె. మనకు సజ్జనుండ.

మట్టిలోనే మనకుసర్వసంపదలు సమకూర్చి విడిచియున్నాడు
అట్టి కరుణామయుని లీలలను ఏమని వర్ణింపగలము.

సు : సౌజన్యా! ఆ పరాత్పరుని లీలలను ఎంత చక్కగా వివ
రించియుంటివి. అవును మంటితోనే మన ఆదిపురుషుల శరీ

రములు సృష్టింపబడియున్నవి. ఆ మట్టిలోనే సర్వము యిమిడియున్నవి. భూమినుండి ఉత్పత్తియగు ఒక్కొక్క వృక్షమునకు ఒక్కొక్క రకముఫలము. వాటి మాధుర్యము భిన్నరీతులనుండు. అంతియే కాదు. కన్నుల విందుగా కాన్పించు చక్కని పుష్పములు వాటినుండి గుభాళించు సువాసనలు. ఆ రంగులు తిలకించిన మేను పులకరించును. గాన ఆయన సృష్టి కార్యములు అద్భుతములు. కాని సౌజన్యా! నా మనోశంకకు నిమిత్త మది కాదు.

సౌ : నిష్కళంకా విషయమును తేటపరచిన తమకూరట కలుగునటుల యత్నించి సఫలీకృతుడ నయ్యెద. గాన పూజ్యులు సంశయింపక తమకు వాటిల్లిన ముప్పును ఎఱిం గించి కార్యసిద్ధి గలుగ యత్నించ నా ప్రార్థన.

సు సౌజన్యా! న్యాయార్జితమైన విత్తము మనకు పుష్కల ముగా గలదు. ఒకరిని మోసగించి బ్రతుకవలసిన పని మనకు లేనేలేదు.

సౌ : ఔను మహాప్రభూ! ఆర్జనలో అక్రమమైన పద్ధతులు చేపట్టి పేదలరక్తము జలగలు పీల్చినట్లు పీల్చి వక్రమార్గ మున పరులసొత్తును బొందుదురు. అట్టివారి అక్రమ ములు అసంఖ్యాకములు.

సు : అట్టి నీచపద్ధతులు మనకు వలదు సౌజన్యా! దైవమిచ్చి నది మనకు చాలును.

సౌ : లేదు ప్రభూ! తుచ్ఛుల కుచ్ఛితములు నా మనమున పొడకట్టి తమకీ సమయసందర్భమున వివరించుచుంటిని.

ఆపదలో ఆశ్రయించిన వారిని తాకట్టు బేరములతో అసలులో నాల్గవవంతు ముట్టజెప్పి మొత్తము గుంజు నీచవర్తనుల బ్రతుకులు మదికితట్ట ప్రాణము తల్లడిల్లుచున్నది

సు : ఔను. అట్టి నీచవర్తనులు లేరనికాదు. దైవాశీర్వాదము మనకు కావలెను. న్యాయార్జితమైన విత్తమే మనకు దక్కును.

సౌ : అందులకే నామనసు తమ సత్క్రియల యందే లగ్నమై తమకు ఆంతరంగికునిగా నిలువ గలిగితిని.

సు : సౌజన్యా ! నీ నిజాయితీ బ్రతుకునకు నా మనసెంతయో ఉప్పొంగుచున్నది. అందులకు నేనెంతయో ఋణపడి యుంటిని.

సౌ : అదేమిమాట మహాప్రభూ ! నమ్మినవారిని చెఱచుట నాచేత కానిపని.

సు : నమ్మిన ప్రభువునకు పంగనామములు పెట్టి మొదటకే మోసము తెచ్చుకుచ్చితులు ప్రపంచమున ఎందరు లేరు. నీవంటి సత్ప్రవర్తనుడు నాకు లభ్యమగుట నాయదృష్టము.

సౌ : సత్ప్రభూ ! తమ ఉప్పుకారమును తిని తమకట్టి కిరాతక చర్యలు జరిగించ నామనసు ఒప్పదు. నిజమే తమరు సెల విచ్చినట్లు స్వామిద్రోహులు ఎందరు లేరు ?

సు : ఉన్నారు. ఈ సమయమున నాకొక స్వామిద్రోహము జ్ఞప్తికి వచ్చుచున్నది.

సౌ : సెలవీయండి మహాప్రభూ ! ఆ సత్యమును నే నెఱింగెద.

సు : పూర్వము ఒక పురోహితుడు రాకుమారిని వలచి ఆమెను తనదానినిగా చేసికొను ఒక యుక్తి పన్నినాడు.

సా : ప్రభువర్యా ! అంతటి ఘోరకృత్యమే ?

సు : సావధాన చిత్తుడవై ఆలకించుము.

సా : సెలవీయండి మహాప్రభూ !

సు : ఆరాజు ఒకరోజు తనకుమార్తె వివాహము నిశ్చయింప పురోహితుని పిలిచి తిథినక్షత్రముల నడుగగా ఆమె దుష్ట లగ్నమున పుట్టినదనియు...

సా : అయితే ?

సు : ఆమె తనయింట ఉండిన తనకు హీనదశ ప్రాప్తించు ననియు వెంటనే ఆమెను...

సా : అంతే ? భటుల కప్పగించి నరికివేయమని ఆజ్ఞాపించి యున్నాడా ?

సు : అట్లయిన తనకోర్కె యీడేరు టెట్లు ?

సా : అందులకు వాడేమి చేసెను ?

సు : రాకుమారికి ఒక మందసము తయారుచేయించి ఆ మంద సములో ఆ కన్యనుంచి ఒక పెద్దనదిలో విడిపించుట మంచి పని విరుగుడు చెప్పియున్నాడు.

సా : అందులకు ఆ పిచ్చితల్లిదండ్రులు అంగీకరించిరా సత్ప్రభూ !

సు : పాపము వెఱ్ఱివారు ఆబిడ్డవలన తమకుకీడని యెంచి అందుల కంగీకరించి బిడ్డను ఆనదిలో వదలుటకు యిష్టపడిరి.

సా : తుదకా పౌరోహితు డేమిచేసినట్లు మహాప్రభూ !

సు : నదికి దిగువల ఆ మందసమును పట్టుకొనుటకు తన శిష్య వర్గమును సిద్ధపరచి యున్నాడు.

సౌ : తుదకు జరిగిన సంఘటనేమి ?

సు : అదృష్టవశాత్తు వేటకై ఆ ప్రాంతమునకు చనుదెంచిన రాకుమారుడు ఆ మందసమును చూచి ఒడ్డుకులాగి అందలి చిన్నదానిని చూచి ఆశ్చర్యచకితుడై తద్విషయమును ఆ అబలద్వారా ఎఱింగి దానికి బదులుగా ఒక ఎలుగు బంటిని పెట్టి మందసమును నదిలో యథావిధిగా వదలినాడు.

సౌ : మహా మంచికార్యమును చేసియున్నాడు మహాప్రభూ ! అయితే రాకుమారి చాల అదృష్టవంతురాలు. పౌరాహితు నకు మంచిప్రాయశ్చిత్తమే జరిగినది.

సు : అంతేకాదు. మందసము కొఱకు దిగువల కాపలా కాచిన శిష్యులు ఆపుచేసి గురువు కప్పగించగా అయ్యది రాకుమారి యని సంబరపడి అందు ప్రవేశించగా అదివీకి చంపినది.

సౌ : భలే గొప్ప ప్రాయశ్చిత్తము జరిగినది. మహాప్రభూ ! "అదే కుక్క కాటుకు చెప్పుదెబ్బ" టారు" పెద్దలు.

సు : అందులకే స్వామిద్రోహులకు పితృద్రోహులకు అగచాట్లు తప్పవు.

సౌ : యదార్థమునే వచించితిరి మహాప్రభూ ! అయితే మీకు స్వామిద్రోహముగాని పితృద్రోహముగాని తలపెట్టిన దెవ రందురు ?

సు : సౌజన్యా ! నీకింకా అర్థము కాలేదా ?

సౌ : లేదు మహాప్రభూ !

సు : ఇంక నేనేమని వచింపను. ఇప్పటికి నీవు గ్రహించియే యుండువని తలంచుచుంటిని.

సా : ఆవిషయమును మీ విశ్వాసపాత్రుడు వినవచ్చునా ?

సు : తప్పక వినవచ్చును. అందులకు సందేహమా ? తద్విషయము నెఱింగి నాకూరట గలిగించు మార్గమును చూచెద వని ఆశ జెందుచుంటిని.

సా : చిత్తము. తప్పక నాశక్తికొలదియత్నించెద. సెలవీయండి.

సు : సౌజన్యా !

ఉ॥ తిండికి లోటులేదు మనదేవుడు కూర్చెను సర్వసంపదల్
గండము లడ్డులేవు మనకార్యము లడ్డుకొనంగ యెవ్వెడన్
మొండిగ బైలుదేరె మనముద్దులపట్టి ప్రదీప్తు డక్కటా!
ఖండనచేసి సంపదను గట్టిగ యిమ్మని కోరె మూర్ఖుడై.
ఈ దుర్మార్గమైన కోర్కె నీ వీనులకెక్కినదనియే తలంచుచుంటిని.

సా : అక్కటా ! ఎంతటి కఠోరవార్త. జటిలమైన వ్యవహారమునందైననూ ఎదురులేని మీకు పెండ్లి పేరంటముకాని తమకు చిన్న కుమారునివలన యింతటి ధారుణమైన కోర్కెయా? ఇయ్యది నాకాశ్చర్యముగా నున్నది. ఆ అమాయకుని ఎవరు ప్రేరేపించియుందురు ?

సు : మనవస్తువు మంచిదైన ఎవరేమిచేయుదురు. పోగాలము దాపురించినపుడు దుర్గుణములు వాటంతటవే సమకూరుతాయి. ఇప్పుడు ఎవరినని ఏమి ప్రయోజనము?

సౌ : స్వామీ! తమరట్లనరాదు. ఒక కార్యమును చేయు టకు పరుల జోక్యము లేనిదే అంతధారుణముగా జరగ నేరదు. ఆవిషయము నేమైనా యోచించియుంటిరా ?

సు : ఎవరని మనము నిర్ణయించగలము. ఈనాడు వచ్చినవాడు భిన్న రుచులు గలిగిన యౌవనులతో నెయ్యము సల్పు చున్నాడు. కాలము పోకడే పచ్చికలిగాయున్నది.

సౌ : అవును దినదిన ప్రవర్థమానమగుచున్న నాజూకులు. తదితర విలాసకార్యములు వాటి పోకడల నేమని వివ రించగలము.

గీ॥ మేను కనిపించువలువలు మేలిముసుగు
నేలకానెడి కురులతో వలపుజూపి
కసిరి ఉసికొల్పుచుండగా కఠముగాను
యువకు లేరీతి చెడకుండ ఉండగలరు ?

సు : సౌజన్యా! నేటి లోకముయొక్క పోకడను ఆకోద్దిమాట లలో ఎంత చక్కగా వివరించితివి. నిజముగా మానవునకు ఆధ్యాత్మిక చింతన అధికముగా యున్న యిట్టి వైపరీత్య ములు జరుగనియే నాతలంపు.

సౌ : స్వామీ! పొరబడుచున్నారు. మానవుడు తాను నమ్ము కొన్నాదైవములకు నిలువుదోపిడి యిచ్చుట, అతిమూర్ఖుడు మానవులనే బలియిచ్చుట, క్రైస్తవులు చర్చిలలో ప్రార్థ నలు చేయుట మహమ్మదీయులు మశీదులలో సాష్టాంగ పడుట యివన్నియు దైవచింతనమునకు మార్గములుకావా?

సు : ఔ నేను! అదియును నిజమే. చిత్తశుద్ధిలేని దైవచింతన నిరర్థకము. విశ్వాసముతో దైవాన్ని సేవించిన మానవుని మానవుడు దోపిడి చేయలేడు.

సా : ఔనుస్వామీ! ఎక్కడచూచినా లేనివారిని ఉన్నవారు దోచుకొనుటయే అధికమైపోయినది. నోరు గలవానిదే రాజ్యము. బలముగలవానిదే బ్రతుకు. అర్థబలముగల వానిదే అందరికంటే పై చేయి అయినది.

సు : సౌజన్యా! ఆ కర్ణకఠోరమైన మాటలు ఆపివేయుము. ఇంక నేనా మాటలు వినలేను.

సా : లేకేమి? ఏమి విత్తుదుమో అదే కోయుదుము. మంది గలవారమని చిందులు త్రొక్కిన దానికొకానొక రోజు గలదు. అది దైవమే చూచుకొనగలడు.

సు : అక్కడెక్కడో అగ్నిగుండము కలదనియు అందు అక్ర మస్తులు యుగయుగాలు కాల్చబడుదురని వేదాలు ఘోషి స్తున్నవి. కాని కలిగినవారే యిక్కడ కరెంటుపాకవల నను వేడుకలయందును వందలకొలది బలియగుట నీవు నిత్యము చూచుటలేదా?

సా : చిత్తము పొరబడితిని. మానవుడు నిజముగా రేపేమి సంభవించునో ఎరుగక విఱ్ఱవీగుచున్నాడు. మనజీవితములు బుద్బుదప్రాయములు. క్షణికమైన బ్రతుకులకు ఎక్కడలేని ఆవేశములు క్రోధములు ప్రబలుచున్నవి.

సు : కాని దైవజనుల కట్టి భయముండదు. మరణించిన పిదప వేదము ప్రకారము ఎవరి సత్క్రియలు, దుష్క్రియలు

వారివెంటవచ్చును. వాటితూకమునుబట్టి యేశిక్ష ఏర్పాటు చేయబడును.

సౌ : కాన ఒకరిని నిందించి మనముశిక్ష తెచ్చుకొనుట ముప్ప నియా మీా సందేశము.

సు : కాన మనబిడ్డను మనము అదుపుచేసికొనుట మనవిద్యుక్త ధర్మము. వాడు ఎంత బోధించిననూ తన భల్లూకపుపట్టును విడువక మొండిగా ప్రవర్తించుచున్నాడు.

సౌ : ఆహాహా! యావనుడు పెండ్లిచేయమని కోరుటధర్మము. ఉన్నతవిద్య నభ్యసించుటకు ధనమును కోరుటధర్మము. కాని తూర్పుపడమర లెరుగని వయస్సులో తనవాటాపంచి యిమ్మని కోరుట అత్యంతాశ్చర్యకరము.

సు : సౌజన్యా! అందులకు నీసలహా!

సౌ : ప్రదీపుని రావించి అతని నిర్ణయమును మన ఎదుటనే తేల్చుకొందము.

సు : ఏమో! మనమాట లాతని మానసమున కెక్కవు.

సౌ : స్వామీా! అట్లని మిన్నకుండుట పాడిగాదు. సామ, దాన, భేద దండోపాయములతో ఆబిడ్డను క్రమమార్గమునకు మలుపుదము.

సు : సౌజన్యా! నీభ్రమగాని, అన్నివిధముల పరికించిచూచి నాము. కాని ఫలిత మావంతయును లేదు. అయిననూ నీ మాట నేలత్రోసిపుచ్చపలయును. కానిమ్ము అతని మాన సికతత్త్వ మెద్దియో తేల్చివేయుదము

సౌ : మహాప్రభూ ! ప్రదీపుని మన సమక్షమున ప్రవేశపెట్టెద.

సు : అటులనే కానిమ్ము.

సౌ : (తెరవైపు తిరిగి) బాబూ ప్రదీపా ! (అని పిలుచును)

ప్ర : ఎవరది ? (అనుచు స్టేజిమీదికి వచ్చును)

సౌ : తమరిటు ఆశీనులుకండు.

ప్ర : (భింకముగా) పరవాలేదు. నాభాగమెంతయో త్వరగా తేల్చివేయండి.

సు : సౌజన్యా ! చూచితివా ? వాని బింకము.

సౌ : మహాప్రభూ ! క్షమించండి. పసివాడు. పెద్దలైన మనమే ఓర్పు వహింతము.

సు : సౌజన్యా ! నాకా ఓపికనశించినది. అయ్యది నీవే చూచుకొని యీపీడ నాకు విరగడచేయుము.

ప్ర : సౌజన్యా! అవతల నామిత్రులు నాకొఱకు వేచియున్నారు. త్వరగా తేల్చివేయుము.

సౌ : బాబూ! తేల్చివేయక ఏమున్నది. మీరట్లు నిశ్చయించుకొనుటకు గల కారణము.

ప్ర : సౌజన్యా ! అదంతా నీకనవసరము. నాభాగము నాకు నీచేతనైతే యిప్పించుము. లేదా నీవు యీ వ్యవహారమునకు దొలగుము. అది నేనే తేల్చుకొందును.

సౌ : నాయనా ! చాల పొరబడుచున్నారు.

క॥ సిరితా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలలిత భంగిన్

సిరితా పోయిన బోవును
కరిమ్రింగిన వెలగపండు కరణిని సుమతీ !

అన్నారు పెద్దలు. లక్ష్మిఅనేది యీరోజు నీవద్ద ఉంటుంది. రేపు మరొకరిని వరిస్తుంది.

ప్ర : సౌజన్యా ! ఆసిరి నన్ను వరించలేదనియే నా మనోవ్యథ.

సౌ : అయ్యయ్యో ! ఎంత పొరబడుచున్నావు ప్రదీపబాబూ ! అది రావడమెంతసేపు పోవడమెంతసేపు. అందులకే మీ తండ్రిగారు యింత వ్యథపడి నిన్నిటకు పిలిపించియున్నారు.

ప్ర : అవును. నాకోర్కెను మన్నించి నాయీప్సితమును నెరవేర్చండి.

సు : సౌజన్యా ! తనభాగముతో తానేమి చేయ నిశ్చయించెనో బైటపెట్టమను అలాగుననే చేయుదము.

ప్ర : సౌజన్యా ! అది నాయిష్టము. నా ఆస్థిని నేను త్రాగి తలకుపోసుకుంటాను అది మీకనవసరము.

సు : ఆహా ! దైవమా ! ఇంతటి మూర్ఖతనము. నే నేనాడో చేసికొనిన పాపమునకు ప్రాయశ్చిత్తము తండ్రి. బిడ్డవయస్సునకు తగిన మాటలుకావు. మాటలు కోటలుదాటుచున్నవి. ఈతనిబుద్ధి ఆ భగవానుడే మార్చుగాక.

ప్ర : లేదు ! లేదు ! మీబుద్ధే ఆభగవానుడు మార్చి నాఅర్ధభాగము నాకిప్పించుగాక.

సు : ఎంతటి మూర్ఖ చిత్తము దేవా !

సౌ : సత్ప్రభూ ! తమరు కొద్దిగా శాంతించిన అసలు విషయమును రాబట్టి తుది నిర్ణయము చేసికొందము.

సు : అటులనే కానిమ్ము.

సౌ : బాబూ! ప్రదీపా! నీ భాగము నీకు పంచియిచ్చుట న్యాయము. కాని నీవొక గృహస్థుడవై తండ్రికి విధేయుడవై బ్రతుకుట నాకెంతయో యిష్టము.

ప్ర : మీయిష్టాయిష్టములతో నాకు పనిలేదు. పెండ్లిచేసికొని ఆ బంధిఖానాలో పడియుండుట నాకిష్టములేదు. స్వేచ్ఛగా నాజీవితము గడుపుటయే నా ధ్యేయము. గాన మీసూక్తులు నాకనవసరము.

సౌ: ఆ॥ తండ్రిమాటమీరి ధర్మంబు విడనాడి
బ్రతుకనె అపుడెపుడు పాడిగాదు
మూర్ఖతనమువీడి ముచ్చటైన బ్రతుకు
నెఱపుచుండు మీవు నేర్పుగాను.

గాన సావధానచిత్తుడవై పెద్దలమాట పెరుగు కూడుగా భావించి ఒక గృహస్థుడవై యశస్సు గడించుము.

ప్ర : సౌజన్యా! ఏమంటివి?

సీ॥ గార్హస్థ్య ధర్మంబు కలరీతుల నెఱింగి
ప్రజల నోళ్ళనుగొట్టి బ్రతుకలేను
అక్రమమార్గాన అర్థంబు నార్జించి
ప్రజలను పీడించి బ్రతుకలేను
తిండిగింజలుదాచి దిక్కులేని ప్రజల
బ్రతుకులు హతమార్చి బ్రతుకలేను
కల్తీల బేరమ్ము కటువుగానే జేసి
పాపపుబ్రతుకును బ్రతుకలేను

ఆ॥ పన్ను నెగురగొట్టి పరిపాలకులకంట
దుమ్ముకొట్టలేను దురుసుగాను
అట్టిబ్రతుకుకన్న ఆస్థిని తెగనమ్మి
పరులకీయ నాకు ఫలముగలుగు.

గాన ఆ అక్రమజీవితమునుండి నన్ను విడుదలచేయండి.

సు : వత్సా ! అట్టి నీనిర్ణయము నాకమితానందమును గూర్చి నది. కాని లోకమున అందరూ నీవంటివారున్న యీకక్షలు కార్పణ్యములు యిలా పెరిగిపోవు.

సౌ : నిజమే స్వామీ ! స్వార్థముకన్నా మించినజబ్బు మానవున కింకొకటిలేదు. స్వార్థము పూర్తిగా నశించి నిన్నువలె నీపొరుగువారిని ప్రేమింపవలెనను సూక్తిని పాటించిన కొదువేమిగలదు. మనమీ సమయమున వ్యథపడవలసిన పనియేమున్నది ?

ప్ర : అందులకు మీ రేమందురు ?

సౌ : తనకు మించిన దానధర్మ మెందునా లేదుగాన క్రమమార్గాన ఆర్జించి అందు పదియవవంతు దైవమునకు మరికొంత పేదలకు వ్యయపరచిన యీలోకమున మనజన్మ సార్థకము కాగలదు.

ప్ర : సౌజన్యా ! స్వేచ్ఛలేని సంసారజీవితమున నన్ను తల దూర్చమనియా నీభావము ?

సౌ : నాయనా! పొరబడుచున్నావు. భార్యాబిడ్డలున్న సంసార జీవితము ఎంతో పవిత్రమైనది. ఆ ఆనందదాయకమైన

దాంపత్యజీవితములో మనము యిమిడిన మన బ్రతుకు స్వర్గ ధామముగా ఉండగలదు. ఇయ్యది సత్యము.

ప్ర: సౌజన్యా! అందలి సాధకబాధకములు నాకు కరతా లామకములు.

సౌ: బాబూ! నీకు యిందు తెలిసినది బహుస్వల్పము. చెప్పెదను వినుము.

సీ॥ సుఖశాంతులను గల్గి శుభములు చవిజూడ
వనితగావలయును వసుధలోన
ఆయురారోగ్యంబు లైశ్వర్యములు పొంద
ఉవిద యవసరంబు నుర్విలోన
స్థిమితమైన బ్రతుకు స్థిరముగ గడుపంగ
ఇల్లాలు వలయును పృథ్విలోన
మగవాడు రాణించ మగువయే తగినట్టి
ఆయుధంబు నరున కవనిలోన

ఆ॥ తోడునీడగల్గి దొడ్డగ జీవింప
భర్తకవసరంబు పడతిపొత్తు
నిజము గుర్తెరింగి నీ జీవితంబును
చక్కదిద్దుకొనుము చల్లనయ్య.

కాన ఆమంచిచెడ్డలు మననడవడినిబట్టియే జరుగుచుండును. కాని సంసారజీవితము నరకతుల్యమైనదిగాదు. మీరు దుష్ట ప్రబోధమువలన అట్లనుచుంటిరి గాని ఏ పెద్దలును సంసార జీవితమును తూలనాడి నరకప్రాయమును చేసికొనలేదు.

ప్ర : ఓహో ! హో ! సౌజన్యా ! నీ మాటలు ఎంత బూటక
ములు. నమ్మదగినవే వచించియుంటివి. చాలు చాలు నీ
సారంగనీతులు.

ఆ॥ వెలితిబ్రతుకువారి వెతలను పరికించ
కోత గలుగువారి గతులుగాంచ
కూడుగుడ్డ కొరకు ఘోషించు బిడ్డల
బాధ లెవడెఱుంగు భవ్యమూర్తి.

బాబూ నా కట్టి ఇనుపసంకెళ్ళు వలదు. మీబంధములతో
మీరే యతలుపడండి. మీ ప్రబోధములు నాకక్కరలేదు.
దయచేసి నా భాగము నాకిచ్చి నాకు స్వేచ్ఛను సమ
కూర్చండి.

సౌ : అయ్యో ! వెఱ్ఱితండ్రీ ! ఎంత అవివేకమున బడితివి ఇంక
మీకేవిధముగా నచ్చచెప్పగలము. గృహజీవనమే ప్రశస్త
మైనదనిబుధులు వేదములు ఘోషించుచున్నవి. బాల్యము
నుండి యౌవనమువరకు తల్లిదండ్రుల రక్షణ. అచ్చటనుండి
గృహస్థ జీవనములో భర్తకు భార్య, భార్యకు భర్తతోడు.
అట్టి సఖ్యము వృద్ధాప్యమున మిక్కిలి అవసరము, అత్యవ
సరము గాన దీర్ఘముగా యోచించి నామాట వినుము.

ప్ర : సౌజన్యా ! నీమాటలు నాకుసరిపడవు. నన్నతిగా పొగించి
విసిగించకు. నీకు చేతనైన నాభాగమును నా కిప్పించుము.
లేదా మిగతా విషయమును నేనే చూచుకొందును.

సు : సౌజన్యా ! వాడిమంకుబుద్ధి నీకిప్పుడైనా అర్థమైనదా ?

సౌ : స్వామీ! అర్థముకాకేమి...అర్థమైనది. ఇంత మొండి తనము తనకెట్లు అబ్బినదో నా కర్థము కావడము లేదు.

సు : పుత్త్రితో పుట్టినబుద్ధి పుడకలతో గాని పోదట. కుక్కతోక వంకరతీయ ప్రయత్నించుట ఎంత అవివేకమో యీతనిని తిన్నని మార్గమున బెట్టుట అంత దుస్తరము.

సౌ : కాన తమరిపు డేమందురు ?

సు : లెక్క ప్రకారము వానికి రావలసినది చిల్లిగవ్వతోసహా అవతల పారవేయుట మంచిది.

ప్ర : సౌజన్యా! భూమి, నిలువధనము, పశుగణములు మొదలగు ఆస్థినంతయు లెక్కచూచి నావాటా నాకుపంచియిచ్చి మంచివారని ఋజువు చేసికొనండి.

సు : (వెటకారంగా) ఆహాహా! ఏమి నీతులు ఏమికోతలు నత్నా! నాకడుపున తప్పబుట్టితివి. నీవింతసైఖరికి నే నెంతయో కుందుచుంటిని. తప్పు నీదికాదు. నే నేనాడో చేసికొనిన అపరాధమునకు ఇది ప్రాయశ్చిత్తము.

సౌ : ప్రభువర్యా! అధిక సంభాషణమువలన ఆయాసము తప్ప అన్యము కానము. గాన మీా యిచ్ఛవచ్చినరీతి పంచిపెట్టుమని నా విజ్ఞప్తి

ప్ర : సౌజన్యా! అలాకుదరదు. ఏభాగమున కాభాగము వివరము చెప్పి మరీ పంచండి.

సౌ : అలానే బాబూ! ఈ ఆస్థి మీా చేతులలో ఎంతకాలము నిలుస్తుందో ఆపరమాత్మునకే తెలియాలి. కానివ్వండి.

ప్ర : అవ్యర్థప్రలాపములు వలదనే నావిజ్ఞప్తి. కాన ఆలస్యము చేయక తేల్చివేయండి.

సు : సౌజన్యా ! ఉన్నా 150 ఎకరములు మూడు భాగములు.

సౌ : న్యాయస్థులు. చాల మంచి నిర్ణయము ప్రభూ !

సు : సౌజన్యా ! అదైనా భూమిరూపమున యిచ్చుటలేదు. నాభూమి బంగారు గనిగడ్డ దాని విలువ రెండు లక్షల యాభై వేలు.

ప్ర : మరి బంగారము రొఖ్ఖము.

సు : యాభై వేలు. పశుగణాదులు కలిపియే ఈ లెక్క. సౌజన్యా ! మొత్తము మూడు లక్షలు చెల్లించి అతనిని అవతలకు పంపివేయుము.

సౌ : బాబూ ! ప్రదీపా ! ఇదిగో నీకు రావసిన ఆస్థి మొత్తం 3 లక్షలు. బ్యాంకులో జమకట్టి పత్రము నీకిచ్చియున్నారు మీాయిష్ట మొచ్చినట్లు ఊరేగండి.

ప్ర : సౌజన్యా ! నాకు కావలసినది ధనము. నాకంతియేచాలు మీా వ్యర్థప్రసంగాలు, ఎత్తిపొడుపుమాటలు నాకనవసరము విత్తమున కెంత విలువున్నదో చూడుము.

సీ॥ విజ్ఞాన మిసుమంత వెదకినన్ దొరుకని
ధనవంతునకు గొప్ప ఘనతగలదు
కులహీనుడైనను కలిమితో తులతూగ
గౌరవింపబడును కరముగాను

గుణహీనుడైనను గొప్పగ భావించి
వంగి మ్రొక్కెదరు పో ప్రజలుభువిని
అంగహీనునకైన అల్లారుముద్దుగ
పిలిచి బిడ్డలనిత్తురి ప్రియముగాను

ఆ॥ లక్ష్మిలోనయున్న లక్షణంబాతీరు
ఘనత గౌరవంబు గలుగ జేయు
ధనము లేనివాడు ధాత్రిని కొఱగాడు
కలిమికున్న గొప్ప బలముజూడు.

గాన నాయీాప్సితము నెరవేరినది. నా విషయమున శ్రమ పడి కార్యసిద్ధిని గావించితివి. నీకు బహుగా కృతజ్ఞుడను నేనిదే వచ్చెద (అని ఉల్లాసముగా వెళ్ళును)

సు : (విచారముతో) సౌజన్యా! ఎంతటి కఠోరనిర్ణయము. మన ఎదుట మనచేతులమీాదుగా జరిగిపోయినది.

సౌ : విధిని తప్పింప ఎవరితరము బాబూ! తిన్ననిమార్గమున మలపవలెనని మనచేతనైనంతవరకు యత్నించి విఫలుల మైతిమి. అందుకు చింతించుట మంచిదికాదు.

సు : సౌజన్యా! ఎంతైనా కన్నకడుపుగదా! తల్లిపోయిన దాది అల్లారుముద్దుగా పెంచిన చేతులివి. ఏది కోరినను అవశ్యము ఆతని కోర్కెనుతీర్చి ముచ్చటపడిన మెత్తని హృదయము. ఇక నేను యీా పుత్రుని ఎటుబాటు నేవిధ ముగా సహించగలను.

సా : ప్రేమస్వరూపా! పితృవాత్సల్యమున మీకు అన్యులు చాటిరారు. ఎంతటి మెత్తని హృదయము. అతనిని మెప్పించి ఒప్పించవలెనని ఎంతయో కృషి సల్పితిరి. కాని తనమొండి పట్టువలన మనము కృతకృత్యులము కాలేక పోతిమి. గాన మీరు విచారమును మాని నిశ్చింతగానుండ నా ప్రార్థన.

సు : పైకము చేతినున్న తిండికి లోటులేదుగాని దానివలన ఎంత ప్రాణాపాయము.

సా : ఔనౌను. ధనమున కాశించి అమాయకులను మోసగించి ఎందరో హత్యలు జరిపిన సంగతులు మన మెఱుగనివి కావు. కాని మనచేయిదాటినపిదప మనమేమిచేయగలము.

సు : అయ్యో. ప్రదీపా! ఎంతటి విషాధమును గల్పించితివిరా! మాయలకు చిక్కి మాన ప్రాణములనే అడ్డు పెట్టదలచితివా బిడ్డా! ఈ ఘోరమును నేను సహించలేను.

సా : మహాప్రభూ యిందు మీ తప్పేమున్నది చెప్పండి. చెప్ప వలసినరీతుల చెప్పి విడిచితిరి. తన కోర్కెవలన గలుగు బాధలు యిరువురము వివరించి చెప్పితిమి. వినసప్పుడు మీరు నేను చేయునదేమున్నది చెప్పండి.

సు : అంతేలే సౌజన్యా! మనవస్తువు మంచిదైన ఏటిలో పార వేసినా తిరిగిరాగలదు. అంతరంగముల నెఱింగిన అనంతు నకు మన అంతరంగములోని వ్యధలు గుర్తించక మానడు గదా!

సా : ఔనౌను. అట్టి దృఢనిశ్చయము మీకున్న మనబిడ్డకెట్టి ఆపదయు కలుగనేరదు. దైవమెప్పటికైనను ఆతనిబుద్ధి మార్చకపోడు. గతించిన దానికై చింతించుట గతజల సేతుబంధనము వంటిది.

సు : కాకేమున్నది. మనోనిబ్బరము గలిగి ఆ పరాత్పరుని పాదముల కడజేరి ఆ వసుధైకరాజును నా బిడ్డను రక్షించి కాపాడి తిరిగి నాకడకు పంప ప్రార్థించెద.

సా : మంచిది. మనసుకు నెమ్మది కలుగుటకు అంతకన్నా మనము చేయునది లేదు. గాన దైవధ్యానము నిత్యము సల్పుదము (అని నిష్క్రమించును)

తె ర జా రు ను.



# ద్వితీయాంకము

[దృశ్యము : పూరింటి వరండాలో పాతకుర్చీలు గోడకు ఏవో మామూలు బొమ్మలుండును వరండా ప్రశాంతంగా ఉంటుంది.]

దుర్బుద్ధి : (వరండాలో నిలబడి) ఒరే దాక్షిణ్యా! (అని పిలుచును)

దాక్షిణ్యా : ఎవరదీ ? (అని లోపలనుండి శబ్దము వచ్చును)

దు : నేనేరా! దుర్బుద్ధిని.

దా : (లోపలినుండి వస్తూ) ఓహో నీవా ? సుబుద్ధివటరా!

దు : ఒరే పేరుకూడా మరచిపోయావటరా బ్రదర్.

దా : ఔనులే దుర్బుద్ధివిలేరా! తమాషాగా అలా అన్నాను.

దు : ఒరే దాక్షిణ్యా! అందరూ నన్ను సార్థకనాముడంటారు. నీవేమిటిరా నన్ను నిరుత్సాహ పరుస్తావు.

దా : లేదులే! నాపేరుదాక్షిణ్యా అయినా నాలోదాక్షిణ్యము లేదుగదా! దానిని సార్థకము చేసుకోలేకే నీకు దానికి వ్యతిరేకంగా సుబుద్ధి అని అన్నాను.

దు : మనము పేరులో ఉన్నా గొప్పతనానికి ప్రాకులాడితే ఈ ఐదువ్రేళ్లు ఎలా నోట్లోకి వెళ్తాయిరా!

దా : అందుకే మనకీ జిత్తులమారి జీవితం.

దు : అలా అనకురా! మానవుడై పుట్టాక ఏదోవృత్తి చేయక తప్పదు. మరి బరువుపనులుచేసి బ్రతకడమా మనవల్లకాదు

దా : అవునులే మనము దొంగతనంగా నోళ్లుకొడుతున్నాము కొందరు దొరతనంగా నోళ్లు కొడుతున్నారు. తేడాఅంతే.

దు : ఔను అలాంటి దుర్మార్గులనోరు మనబోటివాళ్ళము కొట్టక
పోతే వాళ్ళు యీభూమిమీద ఆగుతారా ?

దా : అవునులే మరి వాళ్ళనోళ్ళు కొట్టడానికి మనము బైలు
దేరినందుకేగా ఈ పోలీసుబలగం. ఈ కోర్టులు ఈ
వ్యవహారాలు.

దు : కాకపోతే దాక్షిణ్యా! నీ రక్షణకోసం నా రక్షణకోస
మంటరా ఈ పోలీసు డిపార్టుమెంటు. ఈచట్టు బండలు.

దా : ఔను. ఉన్నా వాళ్ళ ఆస్థిపాస్తులు కాపాడడానికేగా ?

దు : లేకపోతే మనపేదలను కాపాడ్డంకోసమా? అంతామాయ

దా : కడుపుకాలు నిండితే మనము మాత్రము యీ అక్రమ
జీవితము జీవిస్తామా ? 



దు : కాదు మరీ! నీతాత నాతాత మనకేమీ సంపాయించి
పెట్టలేదాయె. ఉన్నవాడు పెరిగిపోతున్నాడు. లేనివాడు
హారతికర్పూరంలా కరిగిపోతున్నాడు.

దా : ప్రస్తుత ప్రపంచముపోకడే అలాఉన్నదిరా దురూ! పేద
వాడు బ్రతికేకోపే లేదు. 

దు : అనువురా! ఎన్నాళ్లు రెక్కలాడినా యీపాడుడొక్కలు
పూడనే పూడవాయె. 

దా : ఏమోరా ఈ అక్రమాలు ఈమోసాలు పేదలకడగండ్లు
చూస్తాఉంటే ముక్కుమూసుకొంటే మంచిదనిపిస్తుందిరా.

దు : ఛా! ఛా! ఎంత తెలివితక్కువమాట మాట్లాడినావురా?

దా : కాకపోతే ఏమిచేద్దామురా ?

దు : ఏదో ఒకరకంగా యుక్తిగా బ్రతకాలిగాని చచ్చి మనం ఏమి సాధిస్తాముురా ?

దా : అందుకని ఎలాచేస్తే మంచిది చెప్పరా ?

దు : ఒరే దాక్షిణ్యా యిదివరలాగా లేనివాళ్ళ జేబులుకొట్ట వద్దు. చేతనైతే ఉన్నవాళ్ళ పర్సులే ఖాళీ చేద్దాము.

దా : ఆ జేబులుకొట్టేపని నాకువద్దురా బాబూ !

దు : అబ్బెబ్బే ! ఎకాయెకిని ఎదురుపడిన ప్రతి ఒక్కడి జేబులు కొట్టి పోలీసులచేత తన్నులుతినాలని కాదు.

దా : మరి ఎలా చేద్దాము మార్గము చెప్పు ?

దు : అచ్ఛా ! అలారా దారికి. ఎప్పటినుండో ప్లానువేశాను.

దా : ఏమిటిరా అది ?

దు : మనము లోగడ బోధచేసి వదిలిపెట్టాము చూడు.

దా : ఏదీ వాడా ? ఆ ధనవంతుని చిన్నకొడుకా ?

దు : ఔను. ఆ చిన్నవాడే ప్రదీప్.

దా : ఎలా చేశావేమిటి ?

దు : అరే పిచ్చివాడా ! మన ఉచ్చులోపడ్డా పిట్ట తప్పించుకు పోవడమే.

దా : అలానా ? ఎలా చేశావేమిటి ?

దు : మనమంత్రము దెబ్బనిపారింది. దానితో మనకామ్ దిల్ ఖుష్ అయిపోయింది.

దా : అరే దుర్బుద్ధీ ! ఆలుగాలేదు, పోలుగాలేదు. ఏమిటిరా యింత ఉల్లాసం ?

దు : అన్నీ వ్యవహారాలు బిగిసిపోయినియ్యాయ్. మనము తెలివిగా ప్రవర్తిస్తే లక్షసీది లక్షనాది మిగిలిన లక్ష అదృష్టవంతులది.

దా : అయితే వాళ్ళనాన్న ఆస్థి పంచియిచ్చాడా ?

దు : పంచడమేమిటోయ్ వెట్టి మొగమా తనకు రావాల్సిన వాటా మూడు లక్షలు దఖిలు వ్రాసియిచ్చాడు.

దా : సెభాష్ ! మొనగాడివిరా ! మనం ఎలా దానిని భుక్తం చేసుకోవడం ?

దు : ఎలా ఏముంది. మకాము లేపుదాము.

దా : లేపి ఏమిచేయాలని ?

దు : మెల్లగా నిషా అలవాటు చేద్దాము.

దా : ఆ మీదట.

దు : బంగారు బొమ్మని అప్పగిద్దాము.

దా : ఏదీ మనఫ్రెండు తారకనా ?

దు : ఔనౌను. తారక లేకపోతే మన తారకమంత్రము పారనే పారదు.

దా : రైటు, రైటు, నీ ప్లాను చాలబాగుంది. వాడూ ఊడ గొట్టిన నాగలి. వెనుకాముందు ఎవ్వరూలేరు. అలాచేస్తే మనకు డిపార్టుమెంటు బెడద ఉండనే ఉండదు.

దు : అందు కేమంటావు ?

దా : మనకు బెడదలేని పనిముఖము. కాన మనము యుక్తిగా ప్రవర్తించాలి.

దు : అంతేకాదు. తారకను మనగుప్పిట్లో పెట్టుకోవాలి. లేకున్న ఆ ఆస్థి మనకు దక్కదు.

దా : సెభాష్ ! మనము యిప్పుడు చేయవలసిన పనిముఖం.

దు : ఏమీలేదు. ప్రదీపుని యిక్కడకు రమ్మని చెప్పాను. గంటలో వాడువస్తాడు.

దా : ఈలోగా మనము తారకతో మాట్లాడి ఆడవలసిన నాటకము తారకతో ఆడిద్దాము.

దు : మంచిది యిప్పుడేవెళ్ళి తారకను కలిసికొందము. (అనిలోనికి వెళ్ళి తారక స్టేజీమీదకువచ్చి కూర్చునేనరకు సావకాశమిచ్చివారు తిరిగి స్టేజిమీదకు రావలెను)

దు : (ఆశీనురాలైయున్న తారకనుచూచి) ఒరే దాక్షిణ్యా ! ఆకాశములో ఉన్నా తారలకైనా కాంతి తప్పనేమో గాని ఈతారకన్ను మాయనైనా మాయదురా !

దా : మనము మాత్రము తక్కువవాళ్ళ మేమిటి ? పట్టవలసిన మాణిక్యాన్నే పట్టివేశాము.

దు : ఔనుమరి. ఆ వయ్యారము ఆనాజూకు అబ్బ ! అప్సరస అందుకే అన్నారు బ్రహ్మకైనాపుట్టు రిమ్మతెగులని పెద్దలు.

తా : అబ్బబ్బ ఏమిటండి మీ మాటలు. ఈతార యీఅవతారములో మీకెంత అమ్మాడు పోయినా ఏమిటి మీ మాటలు మీ సరసోక్తులు.

దు : తారకామణీ ! నిన్నుచూచి మురుసుకొనక ఎవరినిచూచి ముచ్చటపడమని నీ ఉద్దేశ్యము ?

దా : అవును. ఉన్న యదార్థమునే చెప్పుచున్నాము.

తా : అబ్బబ్బా! మీ ఉబ్బింపులకు తబ్బిబ్బైపోతున్నాను. దయచేసి మీపొగడ్తలు ఆపి వచ్చిన విషయము తేల్చి వేయండి

దు : తారకా! మేమిరువురము కలసిరావడములో మాఆంతర్యము గ్రహించియే యుందువు.

దా : మా మాటనిజం కాదంటావా? నీవు చాల సూక్ష్మగ్రాహివి సుమా!

దు : ఏమనుకొన్నావు అంతచలాకీ అయితేనే మన పనులు నెరవేరేది.

తా : అబ్బా! మీరేదో మరుగునపెట్టి నన్ను ఉక్కిరిబిక్కిరి చేయుచున్నారు. అసలువిషయము చెప్పండి.

దు : తారకామణీ! నీకుచెప్పి ఆవిషయమును సాధించవలయుననియే వచ్చియున్నాము.

దా : ఔనౌను. ఈ సమయములో నీవుతప్ప అన్యులు సాధించలేని అమోఘమైన విషయము.

తా : ఏమిటో ఆ మహత్తర కార్యము (అని ఆశ్చర్యపడును)

దు : మహత్తకార్యముకాదు. మహామహా మహత్తరకార్యము

తా : నేను మీ మాటలతో ఊపిరి సల్పలేకుండా ఉన్నాను. దయచేసి ఆ విషయము నాచెవిని వేయండి.

దా : తప్పక ఆ విషయమును నీచెవినివేసి తీరుతాము. ఆ మహద్భాగ్యాన్ని పొందితీరుతాము.

తా : నిజమా ? ఏదీ ! ఆ మహాత్తరకార్యము.

దు : తారకామణీ! మనోహరపట్టణములో సుజనమూర్తి అనే పెద్ద భాగ్యవంతుడున్నాడు.

తా : అయితే ?

దా : ఆతనికి యిద్దరు కుమారు లున్నారు.

దు : పెద్దవాడు ధీరోదత్తుడు.

తా : చిన్నవాడు ?

దా : ప్రదీపుడు.

తా : అయితే !

దు : అతనిని వశీకరణము చేసికొని మాదారికి త్రిప్పియున్నాము

తా : ఎంతవయస్సు ? పెండ్లయినదా ?

దా : పెండ్లిలేదు పేరంటములేదు. మంచి యౌవనుడు.

తా : అయితే మీరేమి చేసినారు?

దు : తండ్రి పిసినారి అయినందున అతని చేతికోనికి చిల్లిగవ్వ దొరక్క అతని ఖోప మాకు చెప్పుకొనగా అతనికొక ఉపాయము చెప్పినాము.

తా : ఏమని ?

దా : సంసార జీవితములో చిక్కులున్నవి. మాలాగ బ్రహ్మచర్యము జరుపమన్నాము.

తా : పాపము మీరు బ్రహ్మచారులా ? (అని పకపకనవ్వును)

దు : కాదనుకో ! మా అవసరము కోసము అతని నేదో రంగములో దింపాము.

తా : తుదకు ఏమి చేసినారు ?

దా : నాభాగము నాకు పంచియిమ్మని ఒత్తిడి చేయించాము.

తా : తండ్రి యిష్టపడ్డాడా ?

దు : ఎవడికోసము. కాలాన్ని బట్టి లొంగక ఏమి చేస్తాడు?

తా : ఏమాత్రము వ్రాసియిచ్చాడు ?

దా : పుష్కలంగా మూడు లక్షలు.

తా : అమ్మయ్యో. అంతడబ్బే ?

దు : ఏమనుకున్నావు ? పట్టుకొంటే దిట్టమైనవారినే పట్టాలి.

దా : మింగితే గుళ్ళే మింగాలి.

తా : అంతేలే ! గుళ్ళు మింగేవారికి గుళ్ళోలింగం లెక్కా-మరి ఏమిటి జరగవలసిన కార్యక్రమము.

దు : మూడులక్షలలో గుంజవలసినంత గుంజి వాడికి పంగనామములు పెట్టడమే. మూడు లక్షలు మూడుభాగములు.

తా : మరి అది ఎలాసాధ్యము ?

దా : తారకామణీ! భూలోక రంభవు, ప్రపంచ సుందరివి. అప్సరసవు.

తా : అయితే ?

దు : నిన్ను, నీ ఒయ్యారమును తిలకించిన ప్రతియావనుడు ముగ్ధుడు కాక తప్పదు.

తా : అందుకని నన్నేమి చేయమంటారు ? ఆ మార్గమేదో సూచిస్తే నేనే మిగతాది పూర్తి చేస్తాను.

దా : నీవు సమ్మోహనాస్త్రము వదలితే బ్రహ్మకైనా పుడుతుంది విరహతాపము.

దు : ఆ మాత్రము దూరమాలోసించక కాదు నీకడకువచ్చింది.

తా : సరే నన్నిపు డేమిచేయమంటారు ?

దా : అతనిని నీవలలో...

దు : కాదు నీ కౌగిలిలో బిగించి మేము చెప్పినట్లు చేయి.

తా : సరే నాశక్తికొలది సాధించి చూస్తాను.

దు : చూడడము కాదు. సాధించి తీరాలి.

దా : ఒరే దురూ! తారక పైకి మెత్తగా పలికినా కార్య సాధనలో మెత్తనికత్తి.

దు : అవునులే మనము అంతంతమాత్రపు వాళ్ళవలలో చిక్కుడమా ?

దా : లేదు లేదు మనము ప్రజలనోళ్లుకొట్టి ఈమె మోహ పాశములో చిక్కి ఎన్నివస్తువులు తనపాదాలకడ కుమ్మ రించలేదు.

తా : సరే గతించినదానికి దెప్పివేతలు దేనికి గాని నాపనిని నాకు అప్పగించండి.

దు : తథాస్తు! మనకార్యము సిద్ధించగలదు.

తా : ఆతనిని నేనెట్లు గుర్తించవలెను ?

దు : ఆ విషయము మేము చూచుకొంటాము.

దా : రేపు నీవు యింటిదగ్గరనే ఉండుము.

దు : మేము ముప్పూరము ఈదారినే వెళ్తాము. వీలుకనిపెట్టి సైగచేయి.

దా : ఔను. అప్పుడతడు నీవలలోపడనప్పుడు మేముచూస్తాము

తా : సరే ! మంచిది.

దు : అరే బ్రదర్ మన కార్యక్రమమునకు కొన్ని పరతు లుండాలి అట్లు లేనియెడల ఈ ఆస్తినంతయు తానే గుట కాయస్వాహా చేయగలదు.

తా : మోహనాంగులారా ! నేనంతటి పరమ ద్రోహినికాను. మీ త్యాగము నేనెఱుగనిదానినికాను. నిమిత్తమాత్రము నే నున్నాను. యత్నమంతా మీదేగాన మననేస్తమునకు భంగము కలుగనీయను.

దా : సెభాష్ ! తారకామణీ ! నీతిగలదానివి. యుద్ధములో కూడా ధర్మయుద్ధమున్నది. అలానే యీ జూదమునందు నీతిని నిలబెట్టుచున్నావు. మాకంతేచాలు.

దు : దాక్షిణ్యా ! అన్నమంతా పట్టిచూడనక్కరలేదు. మన మెఱుగని తారకగాదు ఆగుము. ప్రదీపువచ్చువేళయైనది. (అనుచు అందరూ నిష్క్రమింతురు. రెండవదారిని ప్రదీపు మొదటిమార్గమున యిరువురు స్టేజిమీదకు ప్రవేశింతురు)

దు : (ఎదురుగా వచ్చుచున్న ప్రదీపునిచూచి) అడుగోరా మనమిత్రుడు ప్రదీపు.

దా : (అతనిని కౌగలించుకొన బోవుచు) హలో ప్రదీప్ ! కులాసా !

ప్ర : ఓ ! మహారాజులాగా ఉన్నాను.

దు : అంతేలే ! మహారాజులు మహారాజుల్లాగా ఉండకుండా ఎలా ఉంటారులే !

ప్ర : అరేదురూ ! నీ వ్యంగ్యధోరణిమార్చి సరీగ్గామాట్లాడరా.

దు : ప్రదీప్ నీతోగాక ఎవరితో మాట్లాడను యింతసరదాగా

దా : అవును కలిగినవారి బిడ్డలున్నారంటే లేనివారిని కన్నెత్తి చూడరు. నీబుద్ధిమాత్రము ధర్మబుద్ధి.

ప్ర : సరే మంచిది. నాకు ఒక్క కోర్కె ఉందిరా దురూ !

దు : ఒక్కటేమిటి లక్షకోరికెలు కోరు క్షణములో నీపాదాల దగ్గరవాల్తాయి.

దా : అంతే "ధనమూలం మిథం జగత్తు" అన్నారు పెద్దలు.

ప్ర : ఔనౌను. డబ్బులేనివాడు ఎందుకూ కొఱగాడు.

దు : ఏమిటి చెప్పివేయి నీకోరిక ?

ప్ర : మనము యిక్కడనుండి బైలుదేరి ప్రపంచం మొత్తం చూచిరావాలి.

దా : ప్రపంచములో ఏ ఏచోట్ల ఏమేమి దర్శించాలని నీ ఉద్దేశ్యము ?

ప్ర : భారత దేశములో ఆగ్రాలోని తాజ్ మహాల్.

దు : జపాన్ లో ?

ప్ర : కాగితములో కట్టిన వారిమేడలు పూలతోటలు.

దా : చైనాలో ?

ప్ర : మావో సాంస్కృతిక విప్లవజ్వాలలు.

దు : రష్యాలో ?

ప్ర : చంద్రమండలములో ప్రవేశించే ప్రయోగప్రయత్నాలశాల

దా : ఇటలీలో ?

ప్ర : రోమ్‌లోని ఏటవాలు మేడ.

దు : లండన్‌లో ?

ప్ర : రాణీ నివాసం. పార్లమెంటు భవనం. ఓడలు.

దా : ఈజిప్టులో ?

ప్ర : పిరమిడ్లు.

దు : ఫ్రాన్సులో ?

ప్ర : నిత్యము మారే ఫాషన్సు.

దా : అమెరికాలో ?

ప్ర : అధ్యక్షులను కాల్చిచంపే ఉన్మాదులను.

దు : చాల బాగుంది. చాల మంచి ప్లాను వేశావు.

దా : ప్రదీప్ ! యింత విదేశయాత్ర సల్పడానికి చేతిలో కావలసినంత ధనముండొద్దూ ?

ప్ర : డబ్బు కేమికొదువ. చాలినంత చేతినిండా ఉంది.

దు : ఏమాత్ర మేమిటి ?

ప్ర : మూడు లక్షలు.

దా : సెభాష్ ! ప్రపంచయాత్ర ఐదుసారులు చేసినా డబ్బు మిగుల్తుంది.

దు : మన ప్రదీప్ మంచి *Idea* లోనే ఉన్నాడు.

దా : ఔను. *B. C.* నాటి మనిషి కాదు.

ప్ర : సరే మీరేమంటారు ?

దు : ఏమనే దేమిటి ? ప్రదీపుతో ఎక్కడ దూకడానికైనా మేము సిద్ధమురా భాయ్ !

ప్ర : (పకపకానవ్వి) ***Very good*** చాల బాగుంది.

దా : కాకపోతే ప్రదీప్ ! చేస్తే నీవంటి విశాల స్వభావముగల వారి స్నేహాముచేయాలి గాని లుబ్ధులతో మాకుగిట్టనిపని.

దు : అవును. నమ్మినవారిని చెఱచడము మావల్ల కానిపని.

ప్ర : మంచిది. మన ప్రయాణ మెప్పుడు ?

దు : మనము యితర దేశము వెళ్లాలంటే ***Pass Port*** వగైరాలు ప్రభుత్వము దగ్గరనుండి పొందొద్దూ ?

ప్ర : అవును వాటికోసం అవస్యం ***Apply*** చేద్దాం.

దా : తప్పకుండాను. ఈలోగా మనకు కావలసినవన్ని సిద్ధము చేసుకొందాము.

దు : ప్రదీప్ ! ఆపై వీధిలో నాట్యసభ జరుగుతుందట. కాస్త వినోదానికి వెళ్ళివద్దామా !

ప్ర : ఓ మనము చేసేపనేముంది. (వెద్దాము అని ముగ్గురు లోనికి వెళ్తారు. వెంటనే తారక అర్కెస్ట్రా నసుసరించి డాన్సు వేస్తూ స్టేజిమీదకు రావాలి యింతలో వేరొక మార్గమునుండి ముగ్గురువచ్చి కుర్చీలమీద ఆశీనులై డాన్సు చూస్తారు)

తా : (డాన్సువేస్తూ పాటపాడాలి)

పాట

పిలిచినా – పలుకవురా – నాప్రియుడా – పిలచినా కద
లవురా – నా ప్రియుడా ॥పి॥

1. నీమేను రూపము – నీయంద చందము
మదిలోన నిలిచెను – ముదమార రారా ॥పి॥

1. బాలను నేను నీ - మేలును కోరెద
జాలము చేయక - లాలించరా నన్ను ॥పి॥

3. అమృత మిచ్చెద - ఆదరమున నే
ముదమారగ్రోలి నా - వ్యధతీర్చిపోరా ॥పి॥

(అని నాట్యముచేస్తూనే ఆరంజి మొదలైన డ్రింక్సుగ్లాసులో కలిపి ముగ్గురికినిచిత్తుచేయాలి. ఆమీదట మత్తెక్కి-త్రాగుడు Action చేయాలి.)

తా : (మొదట గ్లాసు ప్రదీపు కందించును)

ప్ర : నాకు కాదు దుర్బుద్ధికని (సైగచేసి అవతలికి పంపును.)

తా : అలాగే దుర్బుద్ధి కందించును.

దు : (త్రాగి) మై డియర్ ఫ్రెండ్ అమృతంలాగా ఉంది నీ వొక గ్లాసుపుచ్చుకో.

ప్ర : దాక్షిణ్యా ! నీవు కానియ్యి.

దా : మిత్రునిమాట త్రోసివేస్తావా ! తారకా ఏది అమృతం ?

తా : ఇదిగో అమృతం (అని గ్లాసు అందించును)

దా : (త్రాగి) ఆహా ! అమృతంకాదు మహామృతదివ్యపానం. కానియ్యి బ్రదర్ చాలబాగుంది మీరు పుచ్చుకోండి తారకా ! కానిమ్ము.

ప్ర : (త్రాగి) ఆహా చాలబాగుంది. తారకామణీ ! నీ నాట్యం చాలా అద్భుతంగా ఉంది. ఈ వందపుచ్చుకొని యింకొక పాటపాడి మరొక అడుగువేయి.

పాట

నలపులమారి – వయ్యారి చంద్రుడ – ఒరుగువంకర
లేదుర నీకు ॥వ॥

1. కన్నె మనస్సు – కదిలింది నేడు
కంటికి నచ్చిన – రారాజు దక్కగ ॥వ॥

2. ఈడైన దానను – జోడైన వాడవు
ఎడబాసి నిన్ను – వెడలను నారాజా ॥వ॥

పాడుచు మరలా గ్లాసు అందించగా త్రాగును. అందరు తలఊపుతూ Action చేస్తారు.

ప్ర : (త్రాగి) ఆహా! మధురం. కాదు మధురాతి మధురం.

దు : దాక్షిణ్యా! మనవాడు వరుసలో పడినాడురా!

దా : మనతార తెలివితక్కువదా ఏమిటి?

దు : మన మాటలు తరువాత. ప్రదీపు ఏమిటో చెప్పబో తున్నాడు.

ప్ర : (నరాలు స్వాధీనము తప్పినవి నాలుక మడతపడుతుంది) అరే బ్రదర్ దురూ! తారపాడి ఆడితే మనంచూశాం నాట్యం. ఇప్పుడు నేను పాడతాను, తార నాట్యంచేయాలి.

దు : (మత్తులోఉండే) తారకామణీ! ఇప్పుడు మన ప్రదీపు పాడతాడట నీవు నాట్యంచేయి.

ప్ర : బ్రాందీ మేలైన మందుర – అది అందని పందుర॥

1. చీకు చింతలు కలిగిన – చిన్ని గ్లాసుపుచ్చుకో
చీకుచింతలన్నియిట్టె – చిటికిపోవురా ॥బ్రా॥

2. భార్యబిడ్డల గోలకి – గ్యారంటి మందురా
   త్రాగి చూడండిర మీరు – భోగము కలుగును ॥బ్రా॥
3. అప్పు లెక్కువ ఉన్నచో – తప్పకుండ త్రాగరా
   చెప్పకుండనే వాళ్ళంత – తప్పుకొంటారు ॥బ్రా॥

దా : బలేబలే (అని ప్రదీప్‌కు షేక్ హాండ్ యిచ్చును. అలానే దుర్గాకూడా యిచ్చును. ఇంతలో తారక లోనికి వెళ్లును)

ప్ర : బ్రదర్ ! లోకంలో ఎంతోమంది **Females** ను చూచాను గాని...అబ్బ...బలె. ఇలాంటి రంభను నేనుసూడలేదురా (మరీక్రైపులో పలికే పలుకులు)

దు : అవును బ్రదర్ ! నీమాట ముమ్మాటికి నిజం. నిజం. అక్షరాలా నిజం.

దా : దుర్గా ! నిజమేరా బ్రహ్మాండమైన పిట్టలే !

ప్ర : పిట్టంటే పిట్టకాదు – పొందుగ పెరిగిన మేలైన పిట్టా బ్రహ్మాండమైనది యీపిట్ట. పిట్టకాదురా బ్రదర్ విను.

ఉ॥ పచ్చని చీరెగట్టి బహుపల్చగనున్నది పూవుబోడి ఆ
వెచ్చని కౌగిటన్ గలుగు పీడని సఖ్యము జీవితాంతమున్
చచ్చగు కాంతలేల మనసౌఖ్యము భాగ్యము మ్రింగివేయునా?
మెచ్చితివయ్యదాని నునుమేనున కెంతయొ ముమ్మరంబుగన్

దు : సెభాష్ ! బ్రహ్మాండం. ఎంత మధురంగా వర్ణించాడురా తారకను.

దా : బ్రదర్ చుక్కలో ఉందిరా మజా !

ప్ర : చుక్కగిక్క నై భాయ్ ! ఆచక్కని చుక్కలోనే ఉంది

మజా. అది నేను వేరే చెప్పనక్కరులేదు. నాకళ్ళు పెట్టు
కొని చూడరా భాయ్. తళతళా ఎలా మెరిసిపోతుందో.

దు : ప్రదీపా! యదార్థాన్నే వచించావు. నీ పద్యములోనే
ఉన్నది ఆ రంభలోని గొప్పతనము మజాకూడా!

దా : ఎలాగైనా పడవలసినవారి చేతిలోనే పడింది తారక.

ప్ర : ఏమో! ఆ అదృష్టము ఎవరికి దక్కునో ఎవరికి తెలుసు.

ఉ॥ నున్నని బుగ్గలన్గలిగి నోటికి రంగులు దిద్ది నీటుగా
సన్నని కాయమున్గలిగి చక్కని కాంతి దిగంతమేలగా
నున్నది సుందరాంగి సుమనోన్నత శ్రేణికి చెందియీ యెడన్
యెన్నగ శక్యమా? లలన ఎవ్వరికందునో? ఆరగించగన్.

దు : ఛా! ఛా! ఎవరి కబ్బడమేమిటి? చేతిలో డబ్బుండాలే
గాని కొండమీదికోతి దిగిరాదూ?

ప్ర : అయితే మనకు అభ్యంతరము లేదంటూరా?

దు : బ్రదర్ నీవు యింతగా మమ్ములను ఆదరించినందుకు ఆ
మాత్రము త్యాగము చేయలేమా?

ప్ర : దాక్షిణ్యా! మీ త్యాగానికి మెచ్చాను అయిన నాకు
సెలవీయండి. ఆ యంగనను యిప్పుడే కలసికొని మాట్లాడి
వచ్చెదను.

దు : అవశ్యమే వెళ్ళి మాట్లాడిరా ప్రదీపా! అందులకు అభ్యం
తరమా! (అనగానే ప్రదీపు లోనికి వెళ్ళును)

దా : అరే దురూ! యీపిడుగును లొంగదీయడానికి ఎంత
ప్రయాస పడాలోనని అనుకొన్నాను. క్షణంలో పడి
పోయేదేమిటిరా?

దు : వయసురా బాబూ. ఏమనుకొన్నావు ? మహా మహా మునీశ్వరులే రంభా-మేనకలను చూచి వెఱ్ఱి గంగరులెత్తి దాసోహం మన్నారు.

దా : కాకపోతే ఎంత విచిత్రమురా. అందుకనే కన్య, కనకం విత్తం అన్నారు పెద్దలు. మరి ఈ వ్యూహములో తారక తన మంత్రాన్ని ఎలా పారిస్తుందో.

దు : ఏం పరవాలేదు మన వ్యూహము నూటికి నూరుపాళ్లు పారితీరుతుంది. నిషాలో చెక్కులు మనపేర వ్రాయించుకోవడము. అయ్యగారి ఎకౌంటు ఖాళీచేయడం.

దా : అందుకనే మనము ప్రక్కనే కాచియుండి సమయం కని పెట్టి తారకకు మార్గం చూపుతూఉండాలి.

దు : మరేమి పరవాలేదు. తారక మనకన్నా తెలివిగాబుట్టలో వేసుకొంటుంది. కాబట్టి మనం ప్రక్క యింటిలో మకాం పెట్టాలి.

దా : చెక్కుబుక్కు అతని *Bag* లోనే ఉందికదూ !

దు : ఉండ కెక్కడికిపోతుంది. అది పోతే దాని బాబుని తెప్పిస్తాడు కాగితాలు కరువా ఏమిటి ?

దా : పోతే యిబ్బంది పెద్దగా లేదన్నమాట. మంచిది. కార్య క్రమము ఫలప్రదమయ్యేటట్లు చూద్దాము పద (అని యిరువురు లోనికి వెళ్ళుదురు )

ప్ర : (లోపలినుండి వచ్చి అటుయిటు చూచుచుండగా తార రెండవ మార్గమున వచ్చి నిలువవలెను.) తారకామణీ !

నీ నివాసగృహ మిదియేనా! ఔనౌను దురు దాక్షిణ్యాలు చెప్పిన గురుతులివియే. వారు చెప్పినది యదార్థము. (అని తనలో తాను అనుకొనుచు ఆమెనుచూచి) ఓహో! తార కామణీ! యిచ్చటనే ఉంటివా?

తా: (వయ్యారముగా) ఔను యిదియే నా స్వగృహము. మీకు ఏమి కావాలి?

ప్ర: నీకోసమే వచ్చాను.

తా: (ఆశ్చర్యముగా) నాకోసమా? చాలవింతగా నున్నదే! ఏమిటో ఆవిషయ సెలవిస్తారా?

సీ॥ కమ్మని గేయము లిమ్ముగ పాడుచు
నాట్యము చేయుచు నన్ను పొగడ
జత్రంబులకు గొంత జతపడ కులుకుచు
కనుసైగలను చేసి కదిపివేయ
కమ్మనికంఠంబు కదిలించి వీణపై
శ్రుతికల్పి పాడుచు చూచుచుండ
మధువులో మమ్ములన్ మైమఱపించుచున్
హాయిని చేకూర్చి అలరజేయ

ఆ॥ అభినయంబుజేసి అద్భుతంబుగ నన్ను
వశము జేసికొనిన వనితవీవు
లగ్నమాయె మనసు లలన నీపై నింక
ఆదరించు మిపుడు హాయిగూర్చి.

తా: ఆహాహా! ఏమి పొగడ్తలు. ఏమివర్ణనలు. అలానా నేను మిమ్మల్ని గమనించలేదే?

ప్ర : సుందరాంగీ ! అప్పుడే నన్ను మరచిపోయావా ?

తా : మరచిపో కేముంది. ఏదో పొట్టగడవని పనులు గదండి.

ప్ర : (ఆశ్చర్యముగా) నీవా ? పొట్టగడవకనా ? నేను నమ్మ లేను పట్టుకొంటే మాసిపోవు నీవంటి సుందరాంగికి పొట్ట నింపుకొనుట ఒక సమస్యా ?

తా : ఏమిా ! తమరేదో ఎండముఖ మెఱుగని సుందరాంగు నిలా వింతగా మాట్లాడుచున్నారు.

సీ॥ బంగారు వర్ణంబు పలుచని వదనంబు
నోటికందని నెలయూటిపండు
ఆజానుబాహువు డందాల రేరాజు
కన్నుమాయని మంచి వన్నెకాడు
నిడివైన ఫాలంబు గడుసైనమాటలు
చాపినన్ అందని చందమామ
నిగనిగలాడుచు నిడివైన కురులతో
కళకళలాడెడి కలువరాజు

ఆ॥ పలుచని పలువరుస విలువైన పలుకులు
అపరమన్మథుండ వవనిమిాద
ఏటికిట్లు మిారలే తెంచి యుంటిరి ?
ఎఱుకపరచుమయ్యా పరమపూజ్యా.

ప్ర : పూబోడి ! నీఅమృతవాక్కులు నామదికి మకరంధమును అందించి ఆస్వాధింప జేసినట్లున్నది. నీ హృదయ మెంత మెత్తనిది సుమా ?

తా : మనోహరా! మీరు నాయందలి యదార్థమును కమ్మని తేనెపలుకులతో వర్ణించియుంటిరి. కాని నేను మిమ్ములను ఊరికే పొగడినది లేదు. యదార్థమునే వచించితిని.

ప్ర : సాధ్వీమణీ! సంసారజీవితమునందు నాకుఏవగింపు జనించి పెండ్లికి ఒప్పుకొనక తండ్రిని విసిగించి స్వేచ్ఛగా తిరుగ తల పెట్టి మిత్రులతో యిటుచనుదెంచితిని. కాని నీరూపు రేఖా లావణ్యములు తిలకించ నామనసు నీయందు లగ్నమైనది.

తా : అది నా అదృష్టము. తమరు వైవాహిక జీవితమును ఏవగించుకొనుటకు కారణము?

ప్ర : సుందరాంగీ! ఎన్నో గ్రంథములు పఠించి కండ్లార స్వయముగా గృహస్థులపాట్లు చూచి నేనీ నిర్ణయమునకువచ్చితిని

తా : గృహస్థ జీవనములో కలుగుపాట్లు ఏవి మిమ్ములను కలవర పరచెనో వివరించి చెప్పగలరా?

ప్ర : అందుకు ఉదాహరణాలు కోకొల్లలు.

తా : ఏది ఒక్క నిదర్శనము అదర్శప్రాయమైన సంఘటన ఒక్కటి చెప్పండి.

ప్ర : భార్యకి కోరికెలు మెండు. ఆకోరికెలు సాధించు నిమిత్తము ప్రతీకలునని దాంపత్యములో పొగలు సెగలు నిత్యము రేగుచునే యుండును. వినుము.

సీ॥ నాగస్వరమునూది నాగుల మెప్పించి
చెలిమి చేయగవచ్చు చెఱుపు లేక
మృగ్గుఁడి జీవులన్ లెక్క సేయక మెక్కు
సింహాంబుతో పొత్తు చేయవచ్చు

అంటశక్యముగాని అగ్నినిస్సైతము
దినసాధనముమీాద తీయవచ్చు
వంపమందినిమార్చి వగదీరగ కులుకు
వయ్యారితో పొత్తు చెయ్యవచ్చు
ఆ॥ మగని మోసగించి మాయలు పన్నెడి
చానతోడి పొత్తు సల్పవచ్చు
మంచి చెడ్డ నీడి మగని ఆగము చేయు
అతివపొందునలన వెతలు మెండు.

తా : పాపము అతిప్రయాసపడి అతివలగుణాలు అతిఘోరముగా వర్ణించారు. గాని నేను రగు దెంచిన కారణము?

ప్ర : ఇదే చానల గొప్పతనము. చెప్పమని పీడించి చివరకు పంగనామాలు పెట్టడానికి సిద్ధంగా ఉన్నానన్నమాట.

తా : అయ్యో ! మనోహరా ! ఎంతమాట నేనంతటి మూర్ఖురాలనుగాను భుక్తి జరుగని నాకు కుయుక్తులా ?

ప్ర : మంచిది. నీ మనసు నాకు తెలిసినది నీస్థితిగతులేమిటో వివరించు.

తా : మీారెరుగనిదేమున్నది. మహానుభావా ?

ప్ర : చక్కని అంగిసౌష్టవంబునుగలిగి ఆటపాటలతో హాయిగా గడుపు నీకుగల యిబ్బందులేవో నే వినవచ్చునా ?

తా : సుందరాంగుడా తమ రెఱుంగనిదేమున్నది. చాల పొరబడుచున్నారు. అందచందము లాహారము పెట్టవుగదా?

సీ॥ అందచందములున్న ఆహారమేరీతి
పుడమిలో దొరకును పుణ్యపురుష

ఆటపాటలు నేర్చి ఆటాడ కేయున్న
బ్రతుకులెట్లు దొరలు భవ్యమూర్తి
పేదసాదలనిన ఆదరించెడి వారు
పుడమిలోన అరుదు పుణ్యమూర్తి
సతికి స్థానంబు నెలమిని గనరాదు
తలచుకొనినగుండె దద్దరిల్లు

ఆ॥ కూటికొఱకుగాదె కోటివిద్యలు నేర్చి
పేదవారలిట్లు వెతలుపడుట
ధనిక నిర్ధనుకుల తారతమ్యములిట్లు
నంతగూర్చె భువిని వరగుణాఢ్య.

ప్ర : లావణ్యవతీ! పేదలపాట్లు బహుచక్కగా వివరించి యుంటివి. నీ మనోవ్యథ నాకు అర్థమైనది.

లా : అయిన ఈదీనురాలికి తమహృదయమునస్థానమున్న దా?

ప్ర : లతాంగీ! తప్పక స్థానమున్నది. నీకోరిక లేమియో నాకు తెలియపరచుము. నాశక్తికొలది నీకు సాయపడగలను. నామిత్రులు నాకొరకు వేచియున్నారు. మాట్లాడి వెంటనే వచ్చెదను. (అని లోనికివెళ్లును.)

తెర జారును.

# తృతీయాంకము

[దృశ్యము : నాలుగు బజారులు కలియుచౌకులో నిలబడి దురుదాక్షిణ్య ప్రదీప్‌కోసము కనిపెట్టుదురు]

దు : అరే దాక్షిణ్యా! ప్రదీప్ ఈపాటికి రావలసిందే. కారణ మేమైయుంటుంది?

దా : అమ్మగారి ప్రేమపాశాల్లో పడ్డాడురా బాబు. వదిలించు కోవడము మాటలేనా ఏమిటి?

దు : లేదులేరా మనమాటంటే అడుగుదాటి అవతలకు వెళ్లడు.

దా : ఆమాట నిజమేగాని "క్రొత్తొకవింత పాతొకరోత" గదా? వింతలో పడ్డాడు.

దు : అయినా ప్రదీపు మాటంటేమాటే. తప్పక వస్తాడు చూస్తూఉండు.

దా : సరేగాని దురూ! వెళ్ళిపేరంటము వద్దంటున్నాడు గదా? తారక మంత్రములో పడతాడాని?

దు : అందుకు సందేహమెందుకు? రుచిపడకనే ఉండాలి. రుచిమరిగిన తరువాత విడదీయడానికి ఆ బ్రహ్మకూడా తరముకాదు.

దా : ఔనౌను. మన ఎత్తుగడ ఫలించవచ్చు.

దు : ఫలించవచ్చుకాదు ఫలించింది.

దా : ఎలా నీ నమ్మకము?

దు : నీవే తెలుసుకొంటావుగా!

దా : అయితే ఎలా మనమా డబ్బుగు జడము.

దు : నీకెందుకు అలా ఆగరా! తారక అన్నీ సంభాళించుకొంస్తుంది.

దా : అంతేలే క్త్రైపులో ఎంతైనా సాధించవచ్చు.

దు : అదీసంగతి. ఎరిగిఉండే అడుగుతావేం. కొంచెం ఓపిక పడితే బండి గాడిని పడుతుంది.

దా : అవునులే తొందరపడితే పనులుకావుగా!

దు : (లోపలినుండి ప్రదీపునిచూచి) అడుగో మనమిత్రుడు. హాల్లో బ్రదర్ !

ప్ర : హాల్లో ! దురూ ! ఎంతసేపై మీరొచ్చి ?

దా : అబ్బే ఎంతోసేపు కాలేదు. ఏవోమాటల్లో పడ్డాము.

ప్ర : అయితే మీరు ఎక్కడికివెళ్లారు? ఏమిటికథా కమామిసు.

దు : ఎక్కడికేముంది. పొట్టతిప్పలకు

ప్ర : అబ్బెబ్బే ! నేనుండగా ! మీరు పొట్టచేత పుచ్చుకొని పొట్టతిప్పలకు వెళ్ళడమా ? **Insult.**

దా : సెభాష్ ! ఫ్రెండ్‌షిప్పంటే అలా ఉండాలి.

దు : చాలమంచిది. నీవు ఎలా చెబితే అలా చేస్తాము.

ప్ర : ఈరోజు మొదలుకొని మీరు నాతో ఉండాలి.

దా : ఇది ఇంకా బాగుంది నిన్ను చక్కగా కనిపెట్టుకొని ఉంటాము.

దు : అలాగే ఉంటాము. పరవాలేదు. నీమాట కాదంటామా? అయితే పెట్టెబేడ సర్దుకొని వస్తాము.

ప్ర : అలాగే మంచిది వెళ్ళిరండి (అనగానే లోనికి వెళ్లు దురు. ప్రక్కనున్న కుర్చీలో ప్రదీప్ ఆసీనుడై ఆలోచనలో ఉండగా మరొక మార్గాన తారక ప్రవేశించును.)

తా : (వయ్యారమును వలకబోస్తూ) ఏమండీ శ్రీవారు కినుక వహించారు.

ప్ర : (తిరిగిచూచి ఆలోచనమాని) ఓహో! సౌందర్యతిలకమా! నీవా ? నేనేదో పరధ్యానములో ఉన్నాను.

తా : ఔనులెండి. ఈ తారకను తరిమివేసి యింకా ఏరంభనో వశీకరణచేసుకొందామని ఎదురు చూస్తున్నారు కాబోలు?

ప్ర : సౌందర్యలతికా! ఏమంటివి ? నేనట్టి ద్రోహినికాను.

తా : మరి మీ అంతరంగపు ఆలోచనలు ఈ అభాగ్యురాలు వినవచ్చునా ?

ప్ర : తప్పక వినవచ్చును. అయినా వినవలసినదేమున్నది ?

తా : అదుగో ! మీ ఆంతర్యమును అప్పుడే అదుపులో పెట్టుచున్నారు

ప్ర : లేదు తారకామణీ! దుకు, దాక్షిణ్యాలను యిప్పుడే సాగనంపి మనోహరికి ఏమికానుక పట్టుకొని వెళ్ళిన మంచిదా యని ఆలోచనలో యున్నాను.

తా : ఓహో! అదియా మీ ఆలోచన. మీరు నాతోయున్న అదియే నాకు పదివేలు.

ప్ర : కాదు నీవు నాతో ఉండుట పదిలక్షలు. (అని దగ్గరకు తీసుకొనును.)

తా : అయితే నేను మిమ్మొక కోరికె కోరవచ్చునా ?

ప్ర : ఒక టేమిటి ? లక్షకోరు అందుకు వెనుకాడేది లేదు.

తా : నిజమా ! మనోహరా ?

ప్ర : తప్పక నీకోర్కెను నెరవేర్చెదను.

తా : అయిన వినండి. ఇప్పటి నాస్థితి నిరాధారము.

ప్ర : అయితే నీకోరికలేమిటో నాకు వివరించు. కాని వివాహ బంధము మాత్రము నన్ను కోరవద్దు.

తా : అట్లయిన మనోహరా! మీ హృదయములో నాకు స్థానం లేదన్నమాట ... ...

ప్ర : నీ అపురూపమునకు అచ్చెరువంది నీ దీనస్థితికి దిగులుపడి కొంతకాలము నీకడనుండ యిష్టపడితిని.

తా : అయితే నే నెవరిని నమ్ముకొనవలెను ?

ప్ర : నీ యిష్టము వచ్చినవారిని.

తా : అయితే మిమ్ములనే నమ్ముకొన్నాను.

ప్ర : నేను కాదనలేదుగదా ?

తా : అలాగైన వినండి. ఒంటరి జీవితమువలన తగిన రక్షణ లేక బాధలకు గురికావలసినచ్చినది.

ఉ॥ దాతివు నేతవీవె బహుధర్మపు బుద్ధినిజూపి నాయెడన్
ప్రీతితో చేరదీసి నిరుపేదనుగాచిన మోహనాంగుడా !
నీతికి నిల్చినావు నను నీదరిజేర్చగ సాహసంబునన్
ఖ్యాతినిగూర్చిసాకుము సుఖాలను పొందుచు నిత్యమిచ్చటన్
తలదాచుకొనుటకు యిల్లులేదు. నా అనువారు నాకసలే

లేదు. గాన తత్ గృహనిర్మాణ నిమిత్తము మీ చిత్తము వచ్చినంత యొసంగిన నేను కృతార్థురాల నయ్యేద.

ప్ర ఓహోహో! యిదియే నా సీకోర్కె. మంచిది.

ఉ॥ మెచ్చితి నీగుణంబు నను మేలుగ జూచిన తారకామణీ!
ఇచ్చెదపైకమున్ విడువు మింక లవంబగు సంశయంబులన్
నచ్చినకట్టడంబుగొని నల్గురు మెచ్చెడి జీవితంబిలన్
హెచ్చుగగడ్పుచున్ బ్రతుకుహీనుల సఖ్యముమానిధీమణీ!
కాన యివిగో! పుచ్చుకొనుము. ఇంతకుముందే యాభై వేలు బ్యాంకినుండి తీసియున్నాను

తా : (పుచ్చుకొని అమితానందమున) అబ్బ యింతధనమే? ఎంత అదృష్టవంతురాలను (అని పాదములపై బ్రాలును)

ప్ర : లావణ్యవతీ! అవి ముప్పదివేలు మాత్రమే? చాలకున్న మిగతాపైకము నిచ్చెదను. మిగిలిన యిరువదివేలు నా ఖర్చులకు కానలెను. (అని దాచిపెట్టును)

తా : కృతజ్ఞురాలను నా జన్మతరించినది.

ప్ర : తారకామణీ! నామిత్రులు దురుదాక్షిణ్యాలను రమ్మని చెప్పియున్నాను.

తా : అందులకు మీ ఆనతి?

ప్ర : ఏమీలేదు! ఒక్కపాటపాడి నాట్యముచేసి మమ్ములను ముగ్ధులను చేయాలి.

తా : శ్రీవారు కోరవలెనే కాని నీతార వెనుకాడునది లేదు. కాని ప్రియా! నాకోరికె ఒక్కటియున్నది.

ప్ర : ఒక్క-టేమిటి? నీవు ఏది అడిగినను కాదనను. కానిమ్ము.

తా : ఏది! నిజమేనా? (అని ప్రదీపు చేతులు విశాలముచేసి కౌగిటిలో జొరబడును)

ప్ర : మనోహారీ! నీ విశాలభావమునకు నేను ముగ్ధుడనైతిని ఏమిటా కోరిక?

తా : మీరు వివాహమా! వలదన్నారు.

ప్ర : అందుకని?

తా : మన ఎడబాటుకు నేను సహించలేను.

ప్ర : నిదానముగా ఆ విషయమును చూద్దాము.

తా : ప్రాణప్రియా! నిజమా! ఎంత ధన్యురాలను.

ఉ॥ ధన్యతగాంచె నాబ్రతుకుధాత్రిని యోగ్యుని దాపుజేరగన్
కన్యను పేదదాన బహుకష్టపు జీవిని లోకమందునన్
పుణ్యముదక్కె నేటికొకపూజ్యుడు జాలియుప్రేమచూపగన్
అన్యులపొత్తుమాని ప్రజలందరి మన్నన పొందచూచెదన్.

ప్ర : సౌందర్యరాశీ! నీ సుందర విగ్రహామునకు తోడు కమ్మని కంఠము, ఆకంఠమునకుతోడు మెత్తనిహృదయము నన్నెంతగానో ఆకర్షించి నీకట్టి సాయముచేయ నామనం బొప్పియున్నది.

తా : నా కంఠస్వరమును పలుమారు పొగడినారు. కారణము?

ప్ర : చెప్పెద వినుము.

ఉ॥ మౌనమునిండి నీముఖముమాయనికాంతితోతాండవించిమా
వీనులవిందుగొల్ప తమపేరెను మించిన కంఠమెత్తి యా

గానము లాలపించ పసిగాయలు కమ్మని కున్కు తీతురే
మానవసృష్టిలో యిటుల మాన్యతనొందుట కేమి హేతువో.

తా : మనోహరా ! ఎంతచక్కగా వర్ణించితిరి నేనెంత ధన్యురాలను. (అని కౌగిట చేరును.)

ప్ర : తారకామణీ ! ఎంత మృదువైన హృదయము (అని నిమిర్చి) అదుగో మిత్రులైన దురుదాక్షిణ్యా లరుదెంచు చున్నారు

దు : (కౌగిటనున్న తారకనుచూచి) ఓహో ! హో ! ప్రదీపా యింకా మేమేమి కనపడతాములే ?

దా : అవును ప్రేమించిన ప్రియురాలు.

ప్ర : దురూ ! అందరియెడ నా అభిమానము సమానమే.

దు : లేదు ప్రదీప్ ! యావనుడవు. నీ మనోభీష్టమునకు ఎదురాడువారము కాము.

దా : సరే మనకేదైనా కమ్మని కాలక్షేపమున్నదా ?

ప్ర : లేకేమి. ఇంతకముందే తారకతో చెప్పియుంటిని. అందుకు తారక సిద్ధముగానే యున్నది.

దు : ఏదీ ! ప్రారంభించుతారా !
(బ్రాందీ సీసాలుగా ఫ్రూట్ జ్యూస్ గ్లాసులు సిద్ధముగా ఉంచుకొనవలెను) ఆమీదట నాట్యము ప్రారంభించవలెను

పాట

తా : నవయావనుడ – వివరించెదరా
జవరాలికి కలిగెడి – విరహాలనురా ॥న॥

1. మిసమిసలాడె – వయసోయి
పరిపక్వము జెందిన – ఫలమిదిరా ॥న॥
2. నమ్మినవారి – కొమ్మనురా
కిమ్మనకుండగ – యిమ్ముగ రారా ॥న॥
3. జవ్వనురాలను – ఓ యౌవనుడా
కవ్వించెడి గొప్ప – వయసిదిరా ॥న॥

(తారక ఆవిధంగా పాటపాడుచు వారిదగ్గరకు వెళ్లి స్పృశిస్తూ రెడీగాఉన్న డ్రింక్సు అందించగా ప్రదీపు తప్పత్రాగినట్లు త్రాగుడు *Action* చేయాలి. అంతట తారక లోనికి వెళ్లిపోవాలి)

ప్ర : బ్రదర్ దిల్ ఖుష్ అయిపోయిందిరా! తారంటే తారే! మా తారను డాన్సులో కొట్టే మనగ త్తే లేదు.

దు : సెభాష్ బ్రదర్! మనసులో చీకుచింత ఉంటే ఒక్క గ్లాసు పుచ్చుకొని యిలా తారక సమక్షంలో ఉంటే లోకాన్నే మరచిపోతాము.

దా : కాదు స్వర్గములో ఉంటాము.

దు : అరే బ్రతికి ఉండగానే స్వర్గానికి పంపుతావేమిటిరా? బద్మాష్.

దా : లేదురా బ్రదర్! అక్కడెక్కడో చీకుచింత లేని లోక ముందటగా.

ప్ర : నాన్సెన్సు! ఎవడా చెప్పింది. నువ్వు సూచివచ్చావా? వాడు సూచివచ్చాడా?

దు : లేదుభాయ్! పిచ్చిముండాకొడుకుల ఉద్దేశ్యాలు.

ప్ర: అయితే మనం జ్ఞానంకల్గావాళ్ళం లేదు లేదు అది నమ్మ టానికి వీల్లేదు. యిదేస్వర్గము తారకామణీ (అని దురూని కౌగిలించుకొనును)

దు: నేను కాదురా తారని బ్రదర్. తారక మరొకపాటపాడ డానికి సిద్ధపడతాఉంది.

ప్ర: అయితే మళ్ళీ ఒకపాట పాడమనండిరా బ్రదర్!

దు: (మెల్లగా దాక్షిణ్యను సైగచేసి చెక్కుబుక్కు అతని Bag లో నుంచి తీయించును దాక్షిణ్య దురుచేతికిచ్చును. దురు తీసికొని) బ్రదర్ బ్రాందీ అయిపోయిందట తెప్పిం చాలి దీనిమీద ఒక సంతకం పడేయి.

ప్ర: అరే బ్రాందీ అప్పుడే అయిపోయిందా? (బ్రాందీ ఖాళీ సీసాతీసికొని) ఆపదలో అమ్మ. దుఃఖములో తండ్రి. కష్టా లలో స్నేహితురాలు (అని పొగడి ముద్దుపెట్టుకొనును)

దా: బ్రదర్! ప్రేక్షకులంతా గోలచేస్తున్నారు. త్వరగా కానియ్యి.

ప్ర: సరే చెక్కు వ్రాశారా?

దు: చెక్కు కాదులే చీటి.

ప్ర: (తూలుతూ) చీటీ అయితే మనం పెట్టేది లేదు సంతకం మనసేతిలో డబ్బుండంగా ఒకరిని అప్పడిగేదేమిటి?

దా: అయితే చెక్కు వ్రాశాము సంతకము పెట్టు.

ప్ర: అద్దీ బ్రదర్! నీవు నాకు నచ్చినవాడవు. సెభాష్. ఏదీ కలము. బుక్కు. (త్రాగిన తిమ్మిరిని సంతకం పెట్టివేయును,

దు : (చెక్కమడచి జేబులో పెట్టుకొనును) తారకామణీ!
ఏదీ యింకా ఆలస్య మేమిటి? కానిమ్ము.
తా : (చీరె మార్చుకొని మరలా ప్రవేశము)

పాట

హృదయము హాయిగసన్ - మనకోర్కెలు తీరెనుగా
1. కటికి చీకటిలో వెన్నెలు - కాచె వట్టియోచనలుతీరె
వేగిరపడిన తూగునపనులు - కాలము రావలెగా ॥హృ
2. పండువెన్నెలవంటి బ్రతుకులు - పాడై పోవొకనాడు
ఏమిలేని నిరుపేదలు వెలుగుట - ఖాయము ఈజగతిన్ ॥హృ
ప్ర : (తూలిపోతూ) బ్రదర్! నాకు నిద్దరొస్తున్నది. నేను
మకాముకు వెళ్తాను.
దు : సరే మంచిది. వెళ్లిపండుకో (అని యిద్దరూ చెరొక రెక్క
పట్టుకొని లోపలికి పంపుతారు)
దా : అరే దుర్యా! తొందరలో వదిలించుకొన్నాము పీడ
దు : లేకపోతే ఎన్నాళ్లు యీబరువు బ్రతుకులు దొర్లిస్తాము.
దా : తారకామణీ! మన ఆశయము నెరవేరినది.
తా : నిర్విఘ్నంగా.
దు : సరే మేము వెళ్ళివస్తాము.
తా : మనోహరులారా! ఏమి వెళ్ళడము ఏమికథ?
దా : కథేముంది. కథముగిసింది.
తా : అన్యాయము.
దు : కాదు వాస్తవము.

దా : జరిగింవంతా వాస్తవము.

తా : ఆవాస్తవము తెలియపర్చండి.

దు : ఆ వాస్తవము నీకు తెలియందేమున్నది ?

తా : అదే మోసమంటున్నాను.

దా : మోసము పీసముకూడా జరగలేదని నేనంటాను.

దు : అవును నీవు ఏమాత్రము గుంజావో చెప్పు.

తా : ఆయన నాకు యిష్టపూర్తిగా యిచ్చినది నలభైవేలు.

దా : మాకేనా అయిష్టంగా యిచ్చింది ?

తా : ఆయిచ్చిందే అందరికి వాటా అంటున్నాను.

దు : నీకు యదార్థంగా ముట్టిందెంతో చెప్పు ?

తా : నా యదార్థాన్ని మీకు ముందుగానే విన్నవించాను.

దు : మేము నమ్మము

తా : మీ ఉద్దేశ్యము ?

దా : నీవలలో చిక్కిన కడనుండి మత్తులో చిత్తుచేసి యీ పాటికి చాలా గుంజిఉంటావు.

దు : మాకు దక్కింది నలభైవేలు మాత్రమే !

తా : ఎంత ఘారుణము. అన్యాయము.

దా : ఘారుణమా ? పొరబడుచున్నావు.

తా : పొరపాటుకాదు నిజమే చెబుతున్నాను.

దు : మాశక్తియుక్తులను ప్రోత్షించి అతనిని నీకప్పగించాము.

తా : అవును అప్పగించినందుకే మీమాటనమ్మి. నా శరీరము ఆతనికి అంకితము చేశాను.

దా : చేసినందుకు బాగా నే బాగుపడినావుగా ?

తా : ఛీ! ఛీ! మీరు ఎంతకైనా సాహసికులే. నన్ను నమ్మించి 'వచ్చేదానిలో ముగ్గురికి మూడు వాటాలని మోసము చేశారు.

మ : నీవు మాత్రము తక్కువ తిన్నదేముంది ? బాగా నే బాగు పడ్డావు.

తా : నరహంతకులు. పిశాచులు, రాక్షసులు ఎక్కడో లేరు.

మ : ఓహో! హో! ఈమె బుద్ధిమంతురాలు.

దా : కాదు నయగారి. వెన్నపెడితే నాకనేరదు.

తా : అబ్బబ్బ ఎంత మోసము. ఈ లోకములో ఎవ్వరినీ నమ్మరాదు.

దు : మమ్ములను నమ్మి నీవు నష్టపడిందేమీ లేదు. పాపం అమాయకుడు.

తా : నోరుండగనే నాలుకతీశారు. హంతకులు, ద్రోహులు.

దా : తారకా! నీ అహంకారమును అదుపులో పెట్టు.

తా : లేకపోతే ?

దు : ఇదిగో చూచావా ? చాకు- దీనికి ఆహారమిస్తాను.

తా : ఛీ! ఛీ! దుష్టులు ఎంతకైనా సాహసులు. పోయినది పోగా ప్రాణహాని దేనికి ?

దా : అలాఅని యిల్లుజొరబడు. ఎక్కడైనా యీ విషయం ఎత్తావా ? చీల్చివేస్తాము.

దు : అదే నీకుప్రాయశ్చిత్తము. (మౌనంగాయిల్లుజొరబడును.)

తా : ఆహా ! దైవమా ! ఎంతటి దుర్దశ వాటిల్లినది.

(అని లోనికి వెళ్ళును)

దు : దాక్షిణ్యా ! తారకకు ముట్టనలసిందేమో ముట్టింది. మనము తనకొక దారి చూపించాము.

దా : అంతేలే ! నటకురాలిదేముంది ? అంతానటనేగా ?

దు : నటనో ! బూటనో ! దక్కినంతవరకు గుంజుకొన్నది. ఈ చెక్కు మార్చుకొని చెరిసగము తీసికొని హాయిగా కాలము గడుపుదాము.

దా : అంతేలేరా ! బ్రతికినంత కాలము 'బజావు' పనులు మనకు దేనికి ? పాపము పుణ్యము కనిపెట్టి బ్రతకాలి. కాన భజన చేసుకుంటూ...

దు : సంసారములో కూలబడదామంటావా ? అంతేలే ! మనం వాడికంట పడకూడదు.

దా . అవును మకామే మార్చివేద్దాము.

దు : అవును చెక్కు మార్చుకొని చేతికి దక్కించుకొంటే తరువాత ఏ బాధ ఉండదు.

దా : అయినా మనము వాడి జేబులోనిరొఖ్ఖం లాగలేదుగదా ?

దు : అవును చెక్కు వ్రాయించుకొన్నాము.

దా : అవున్లే లోగడ చెక్కులకు లేనిగొడవ దీని కేముంటుంది ?

దు : ఓకే ! వెళ్ళివద్దాము (అని నిష్క్రమింతురు)

ప్ర : (బాగా త్రాగి తూలుతూ)

జగమేమాయ-బ్రతుకే మాయ-జీవితంలోసారమింతేనయా

ఆడముండలను దరిరానీకోయి—అన్యులను నీకడకు – రానీయ కోయి – మతిగలిగి నీవిలను – జీవించవోయి.

అంతా మోసం. మాయ. కాదు భ్రమ. అందుకే నేను తెలివైన పనిచేశాను. అన్నంటే తమ్ముడికి గిట్టదు. తమ్ముడంటే తండ్రికి గిట్టదు. అమ్మకు కూతురు అసలేపడదు. మధ్యలో వచ్చిన అల్లుడిదేముంది? బోడిముండాకొడుకు. అందుకే మనం పెళ్ళంటే ఒప్పుకోంది. కలిగినంతవరకు తెచ్చుకొన్నాను. దానాధర్మము చేస్తున్నాను. మనల్ని అడ్డుకొనే దెవరు? మనకు పావలా డబ్బులు కావాలంటే బ్యాంకే ఉంది మనమే ఉన్నాము. దగ్గరుంటే తన్ని కాజేస్తారని మనకు తెలుసు. అందుకని స్వేచ్ఛగా హాయిగా యీ ప్రదీపు బ్రతుకు తెల్లవారితే సరిపోదా? ఔనౌను సరిపోతుంది. యేయ్ తారకేశ్వరీ! ఎక్కడున్నావ్. ఏదీ ఆ నిర్భాగ్యురాలు. అమ్మా తారకాదేవీ! ఏమీ నేనంటే భయపడుతున్నావా? అదుగో తారక (అనగానే రెండవ వైపున నిలబడియుండవలెను) ఏదీ? నాతార! ఈపాపిష్టి ఆకాశములో ఎక్కడా కనిపించడములేదే? మబ్బులు అడ్డుపడ్డాయా? లేదు మనకళ్ళే త్రాగుడువల్ల తిరిగిపోయి నియ్యి. ఇదిగో తార. ఈ మెరిసేదే నా అందాలతార (దగ్గరకువెళ్లి) అమ్మా త్రాగిఉన్నానని భయపడుతున్నావా? పిచ్చిదాన.

తా : మనోహరా! లేదు. లేదు.

ప్ర : ఔనౌను. నీవు ఉత్తమమైన తల్లివి. నీకు ఏమి కావాలో చెప్పు. అంతే యీ ప్రదీపునీ విషయములో వెనుకాడడు.

తా : ఔను మీగుణము నాకు తెలుసును. మీకేమి కావాలి?

ప్ర : నాకు చాల చిరాగ్గాఉంది ఒక్కపాటపాడి నన్ను నిద్దుర పుచ్చు.

తా : సరే అలాగే ! (పండుకొనమని తొడమీద తలపెట్టి నిద్రించుచుండగా పాటపాడును)

పాట

సుకుమారా – సుశరీర – సుందర వదన జోజో॥

1. మానవ జీవితం – మాయలబొమ్మ
   కనిపించి అంతలో – కనుమరుగౌను ॥జోజో॥

2. క్షణికపు జీవితం – కడగండమయము
   నిజమరసి నిద్రించు – నిర్మల హృదయుండ ॥జోజో॥

ప్ర : (పాట అయిపోయేసరికి తటాలునలేచి) మంజులవాణీ ! ఎంత హాయిగా నిదురపట్టినది. నీ ఋణము ఎలాతీర్చుకో గలను.

తా : మీరు తలంచుకొనిన అది ఎంతలో పని.

ప్ర : అబ్బే ఆర్థికంగా సహాయపడు. సహాయము లెక్కలోనిది కాదు. పవిత్రమైన ప్రేమభావముతో ఏవిధమైన ఉపచర్య చేసిన నీఋణము తీరునాయని నా అభిప్రాయము.

తా : మీరు చూపించుప్రేమయే నాకత్యంత అమూల్యమైనది నాకదియే చాలును.

ప్ర : మరి నీకేమి కావలెను ?

తా : నేనుండుటకేదో చక్కని వసతి నేర్పాటుచేసియున్నారు. నేను హాయిగా మీతో షికారు చేయుటకు చక్కని కారు కావాలి.

ప్ర : ముష్టిది. అదెంతపని.

తా : మనోనాయకా ! అంతకంటే నాకేమికావాలి ?

ప్ర : నీకు యిప్పుడే చెక్కు వ్రాసియిస్తాను (అని ఎకౌంటు చూచి బిత్తరపోయి) తారకామణీ ! మోసము. మోసం. బ్యాంకులోఉన్నా నా **Amount** అంతా **Close** అయినది. నా ఖాతాలో ఒకవంద మాత్రమే ఉన్నది.

తా : అబద్ధం.

ప్ర : లేదు ! తారకా ! దుర్బుద్ధి దాక్షిణ్యా నన్ను ముంచి వేశారు. ఇవిగో లెక్కలుచూడు. నా జీవితములో యిప్ప టికి అర్ధభాగముకూడా గడవలేదు. నేనెలాబ్రతకాలి.

తా : (మూతి విరుచుకుంటూ) మహానుభావా డబ్బు లడిగి నందుకు యిదొక నెపమా అలా అంటేగాని అడిగినకోర్కె ఎగుర గొట్టవచ్చునా ?

ప్ర : లేదు. తారకా ! అదుష్టులు నాజీవితాన్నే నిలువున ముంచినారు.

తా : ఎవరువారు ?

ప్ర : ఎవరేమిటి ? నమ్మిన మిత్రులు.

తా : ప్రదీప్ ! మంచి ఎత్తులోనే ఉన్నావు.

ప్ర : లేదు తారకా ! నామాట నిజము.

తా : నీకున్న ఆస్థిఅంతా మూడు లక్షలేనా ?

ప్ర : అవును నా తండ్రి నాకు రావలసినవాటా 3 లక్షలు వ్రాసియిచ్చారు.

తా : ఇంకా వేరే ఆస్థిపాస్తులు లేవా ?

ప్ర : నాకు రావలసినదేదో చిల్లిగవ్వతో సహా లెక్కగట్టి యిచ్చినారు. నేనెలా బ్రతకాలి ?

తా : అయితే నన్ను బ్రతికించమనా ? డబ్బుండగా పెండ్లి చేసికోమంటే బ్రహ్మచారిగా ఉంటానని భీష్మించావు.

ప్ర : అలా అని నేను నిశ్చయించుకోలేదు తారకా !

తా : తారను మెడకు కట్టుకొని యీమూడు లక్షలు దీనికి కట్టబెట్టడ మెందుకని దురుద్దేశపడ్డావు.

ప్ర : లేదు తారకా !

తా : కానిమాట నిజమేలెండి. వేశ్యని పెండ్లిచేసికొంటే బ్రతుకు పాడౌతుందని చాలదూరమాలోచించావు.

ప్ర : అట్టి సంకుచిత భావాలు నాకసలేవు తారకా ! గాన నన్నుమన్నించు.

తా : ఇందులో మీరు చేసిన తప్పేముంది ? నేను మన్నించేదేముంది తాళిగట్టిన మగడివి కాబట్టా ?

ప్ర : అంతేనా తారకా !

తా : అంతే కాకేముంది. నేనడిగిన కోర్కె యీక్షణములో తీర్చగలిగితే నాదగ్గర ఉండు లేనియెడల దారిబట్టు.

ప్ర : ఛీ! దుర్మార్గురాలా! ఉన్నదంతా మీముగ్గురికే ధారపోశాను

తా : అంతేగాని తమను త్రాగి తందనాలాడ లేదన్నమాట.

ప్ర : ఎంత త్రాగితే మాత్రము. మూడులక్షలు కర్పూరంలాగా హరించి అంతలో ఎగిరిపోతాయా ?

తా : లేకపోతే నేను తిన్నానంటావా ?

ప్ర : నీవని నేనన లేదు. సిరివచ్చింది నారికేళములోని నీరులాగా హరించింది కరిమ్రింగిన వెలగపండులాగా మాయమైంది.

తా : తప్పునీది. నాబ్రతుకు నన్ను బ్రతకనివ్వండి.

ప్ర : నీ బ్రతుక్కు నేను గండికొట్టలేదు. నిన్ను బాగుచేశాను పరవాలేదు. నేను వెళ్ళిపోతున్నాను.

తా : చాలమంచిది. తొందరగా వదిలించుకొన్నాను పీడ.

ప్ర : ఛీ! నీచురాలా! వేశ్యానోరు లోతైనగొయ్యి యని ఊరకనే చెప్పలేదు పెద్దలు. పీడనట! పీడ.

తా : అంత తెలివి గలిగినవాడవి ఈమోసగాళ్ళ ఉచ్చులో ఎలాపడ్డావు

ప్ర : నల్లనివన్నీ నీళ్ళు. తెల్లనివన్నీ పాలని నమ్మాను. అందుకే పంగనామాలు పెట్టారు.

తా : నీకు పెట్టినవారే పెట్టారు. దయచేసి త్వరగా నాగడప దాటు (అని లోనికి వెళ్లును)

ప్ర : మంచిది. పాఠము బాగానేర్చుకొన్నాను. ఇప్పుడు ఎక్కడికి వేళ్తే మంచిది. కాదు ఏదో ఒకవృత్తినేర్చుకొని ఆపాత మిత్రులతోనే బ్రతకడం మంచిది (అని లోనికి వెళ్లును)

దు : (చెరిమొక మార్గమున దురుదాక్షిణ్యాలు ప్రవేశింతురు)
ఒరే! దాక్షిణ్యా మనవాడి సంగతి విన్నావా ?

దా : ఎవర్రా వాడు ?

దు : వాడే మనమిత్రుడు.

దా : వాడా! ప్రదీప్‌గాడా ? మొత్తానికి వాడు ఎక్కడున్నది అన్ని ఆరాలు తీస్తాడన్నావన్నామాట.

దు : లేదు లేరా! కంటికి తగిలేవుల్లను కనిపెట్టి తిరగమన్నారు పెద్దలు.

దా : ఏమిటాకథ ?

దు : అమ్మగారు అంతా ఒడుపుకున్నది.

దా : బొచ్చ చేతికి వచ్చిందా ?

దు : రాకేముంది. ఉన్నది కాస్త మనము గుంజేస్తే.

దా : అయితే అయ్యగారికి ఉద్వాసన చెప్పిందన్నమాట.

దు : అవును. మనలను ఆశ్రయించి బ్రతకాలని మనకోసం వెతుకుతున్నాడట.

దా : ఆపీడ మరలా మనకు దేనికి ? సాధ్యమైనంతవరకు మనము తప్పుకు తిరగడమే మంచిది.

దు : అలానే! ఒకవేళ మనకు తటస్థపడితే ఏమి చెబుదాము.

దా : చెప్పేదేముంది ? సలాము కొట్టడమే ?

దు : సరే జాగ్రత్తగా ఉండు (అంటూఉండగా మాసినబట్టలతో ప్రదీపులోపలనుండి వచ్చును)

ప్ర : హల్లో! దుదూ! చాలాకాలానికి కనిపించారు.

దు : ఔను నిన్ను నమ్ముకొని కూర్చుంటే ఒకరోజు పెడతావు రెండు రోజులు పెడతావు.

దా : ఏళ్ళెల్లకాలము ఎవరు పెడతారు ?

ప్ర : అందుకని ?

దు : రెక్కలు విరుచుకోందే డొక్కలెలా ఆడతాయి.

ప్ర : అయితే చాల కష్టపడుతున్నారన్నమాట.

దు : లేదు మాకు ఊరకనే వచ్చిపడుతున్నాయి మాటలు.

ప్ర : లేదులే బ్రదర్ ! ఒక సిగరెట్టుముక్క యిలాపడేయ్ !

దు : ఇంకానయ్యం. ఒక పావలా యిటు పడెయ్యమనలేదు.

దా : ఏం అమ్మగారిదగ్గర మకాము ఎత్తివేశావా ?

ప్ర : అమ్మగారు క్షవరం చేసింది.

దు : ఏదీ ! (అని తలవంకచూచి) నెత్తిమీద వెంట్రుకలు బాగానే ఉన్నాయే.

ప్ర : మీకు అలానే ఉంటుంది. సిగరెట్టు భాగ్యానికి ముఖముఖాలు చూచుకొన్నారు.

దా : నీకేం పెట్టిపుట్టిన బిడ్డవు. అలానే ఉంటుంది.

ప్ర : దాక్షిణ్యా ! ఎంత విపరీతంగా ఉన్నాయి మీ మాటలు.

దు : ఉన్నవారికి అలానే ఉంటాయి మా మాటలు.

ప్ర : అబ్బ చాలకటువుగా ఉన్నాయి మీ మాటలు.

దా : ఉండవచ్చు మరిలేనివారినిచూస్తే. అమ్మగారికి అడిగినంత యిచ్చావు.

దు : అవును. ఆమె నడగ్గూడదు ! సిగరెట్లకూ సినిమాలకు.

ప్ర : పాపం ఏమి ఎరగనట్లు మాట్లాడుతున్నారు.

సీ॥ గుప్పించి యిచ్చితిన్ గొప్పగాధనమును
కోరిన తడవుగా కోర్కెదీర్చ
సరదాలు చేయగా "జల్సాగ" నిచ్చితి
వేలకొలది మీకు విత్తమెంతొ
నృత్యాలుతిలకించ నిజముగా నిచ్చితి
వెనుకాడకుండగ వేలకొలది
బిరియాని భుజియింప కరిగించిపోసితి
విరివిగా ధనమును విసుగకుండ
ఆ॥ కడుపునిండమెక్కి కాదను ద్రోహులన్
కానలేదు నేను కలియుగాన
దైవమెటుల మెచ్చు దాక్షిణ్య మిమ్ములన్
పాపభీతిలేని పనులకెల్ల.

దా : ఓహోహో! ఎంత నయగారివయ్యా. చీకటి వ్యాపారము చేసి పేదలనోళ్ళుకొట్టి బొజ్జలు నింపేధనవంతుల సంగతి.

ప్ర : నాతండ్రి అటువంటి పరమకిరాతుడు గాదు. న్యాయార్జితమైన విత్తముతో ఆయన సంతృప్తిచెంది ఆయన సెభాషనిపించుకొంటున్నారు. మీవంటి మోసకారి కాదు మానాన్న.

దు : అవునుమరి. ఎవరితండ్రిని ఎవరు పోగొట్టుకొంటారు ?

దా : లక్షాధికారి కాకపోతే మీతండ్రి లక్షలెలా పంచియిచ్చాడు.

ప్ర : స్వార్జితము. దైవమిచ్చిన భాగ్యము.

మ : కష్టపునిండినవారు దైవమంటారు. దయ్యమంటారు.

దా : మాకుఉంటే అలానే చెబుతాము.

ప్ర : మీారు తక్కువ తిన్నా దేమున్నది ?

మ : మేము పండిన ధాన్యం కొట్టుల్లోదాచి పేదల్ని ఏడిపించడం లేదు.

దా : మేము పంచదారలో తౌడు కలపడములేదు.

మ : ఔను. మేము బియ్యములో రాళ్ళు కలపడములేదు.

దా : ఎరువులో ఉప్పు కలపడములేదు.

మ : అలా దుర్మార్గము చేసి మాజీవితాలను పెంచుకోలేదు.

ప్ర : అమ్మయ్యో ! మీాతో నేను గెలవలేను.

మ : పాపము అర్భకుడవు. నీకు మాటలేరావు.

దా : ఉన్నవాడు కదూ ! భాగ్యవంతులను వెనుకవేసుకు వస్తున్నాడు.

ప్ర : ఇప్పుడు మీారే ఉన్నవారు. నేను ఫకీరుని.

దు : (నవ్వుతూ హేళనగా) నీవు ఫకీరువికాక, బికారివికాక ఏమైంది ?

ప్ర : ఆహా ! మీారుహృదయములేని రాక్షసులుసుమా! నన్ను నమ్మించి నాఆస్థినిదోచి, చివరికి నాతోవ్యంగ్యధోరణియా?

దా : ప్రదీపా ! చాలు ! చాలు ! లక్ష్మి ఎవరిని బులిపించి మోహింపించాలో అక్కడికే వెళ్తుంది.

దు : కాబట్టి నీ సర్వస్వాన్ని సమర్పించిన వేశ్యకడకు వెళ్ళు రక్షిస్తుంది.

ప్ర : చాలుచాలు మీ వింతసలహాలు. సిగ్గులేక నా వేశ్యకడకు!

దు : ఇప్పు డొచ్చిందా ? సిగ్గు ! కరువు రాబోతుంది. కళ్ళు తెరచి ముందే మేలుకో !

ప్ర : నారుపోసినవాడే నీరుపోస్తాడు. మీ సూక్తులు నాకేమీ అక్కర లేదు. ఈ మేలుచాలు.

దు : తప్పకుండా మేలే చేశాము మిత్రమా !

దా : నిజంగా మేము తలంచుకొంటే ఊపిరే తీసేవాళ్ళము.

దు : అలా ఉంచితే అడుక్కుతినైనా బ్రతుకుతావని వదలి వేశాము.

ప్ర : అయ్యో ! భగవంతుడా ! ఎంతటి కర్కశహృదయులు. ప్రాణాలుకూడా లెక్క చేయరు. ఎంతటి మూర్ఖత్వం.

[తె ర జా రు ను]



# చతుర్థాంకము

[దృశ్యము : తారక గృహప్రాంగణము. వరండాలో కుర్చీలుండును ఆరిమొక మార్గాన దుర్బుద్ధి దాక్షిణ్య ప్రవేశింతురు)

దు : దాక్షిణ్యా! తారకేశ్వరి భవనము ఇదేనా ?

దా : అదేం పేరు చూడరాదూ!

దు : ఓహో! బోర్డుకూడా తగిలించిందే.

దా : దానిరోజులు ఎంతలో మారాయిసుమా ?

దు : అవును డబ్బుంటే కొండమీదికోతి దిగివస్తుందంటారు ఇదే కాబోలు.

దు : కాకపోతే ఆపిచ్చిముఖమువాడు ఏదో వెఱ్ఱిలోపడి దానిని బాగుచేసి పోయాడు.

దా : కాదులేరాదురూ! మనచేతిలో పడింది. భాగ్యమబ్బింది

దు : అదృష్టవంతురాలు దానిదేముందిలే ?

దా : లక్ష్మి! లక్ష్మి మహిమయ్యా! గనీబుని గరీబుచేస్తుంది గరీబుని గనీబుని చేస్తుంది.

దు : ఔనౌను. అదిలేకనేగదా! లోగడ అనేక కష్టాలకు గురైంది, మనము.

దా : మరి పలుకరించి పోదామా సౌభాగ్యవతిని.

దు : దానిముఖము దానినేమిటి పలుకరించేది. మనకంటే భాగ్యవంతురాలా ?

ప్ర : (లోపలినుండి) అమ్మా ! ఆకలి. మాధాకవళముతల్లి. (అంటూ చినిగిన బట్టలు, మాసినజుట్టు, గడ్డము హృదయ విదారకముగా కనిపించును)

దా : ఎవర్రావీడు ? ఎవరో ఎరిగినమనిషిలాగా కనిపిస్తున్నాడు

దు : (గుసగుస) ఎవరోకాదురా ! వీడు ప్రదీప్ ?

ప్ర : బాబూ ! అంతముద్ద పెట్టించండి. (యిరువురు మెల్లగా జారుతారు) ఏంబాబూ నన్నుచూచి భయమువేసిందా ? పోతేపోయారు కనబడే యింటికివెళ్తాను. (రెండవద్వారము కడకు వెళ్ళి) మాధాకవళము తల్లీ !

తా : ఎవరదీ ! ఇప్పుడేమిలేదు వెళ్ళు. (అని లోపలనుండి పలుకును)

ప్ర : అమ్మా ! మూడుపూటలనుండి పాచినోరు తెరువలేదు.

తా : యేయ్ ! నీకు వేళాపాలా లేదూ ?

ప్ర : క్షుద్బాధతల్లి. కమికెడన్నము పెట్టుతల్లీ. (క్రిందమీద చూచి గురుతుపట్టి ఆశగా చూచును)

తా : యేయ్ ! పట్టు (అని అన్న మిసిరివేయును) ముఖం చూస్తేనే భయము పుడుతుంది (యిసురుగా అనును)

ప్ర : ఆహా ! దైవమా ! పాచినోరు తెరచి మూడుపూటలైనది ఎంత దిక్కుమాలినస్థితి దాపురించినది దైవమా! నేనేమి చేతును. గ్రామమంతా తిరిగినా పట్టెడన్నము దొరకలేదు ఈ క్షుద్బాధ సవిధముగా అణపగలను చేతిలో పైక మున్నపుడు కండ్లు పొరలుగ్రమ్మి అహంకారమెక్కి భూమి

మీాద నడువలేదు. ఎవరు త్రవ్వుకొన్నా గోతిలో వాడుపడక తప్పదు. నాభాగ్యముచే మేడలుకట్టిన ద్రోహి నన్నుగుర్తు పట్టకనే కమికెడన్నము విసిరికొట్టినది. ఎంతటి కాఠిన్యము. ఎచ్చటనైనా కొలువుచూచుకొని పొట్టనింపుకొందును. అయినా......నేనేమి పనిచేయగలను ? ఏమిచేసెదను. 'ఆకలిరుచిఎరుగదు. నిద్రసుఖమెఱుగదు.' 'అయినా ఏదో' ఒకపనిచేసి జీవించుటకు యత్నించెదను. (అని బైలుదేరి నాలుగడుగులు వేయగా పందుల యజమాని బ్రొరగలిగి పంచకట్టుతో చొక్కా లేకుండా లోపలినుండి వచ్చును. వానికి నమస్కరించి) బాబూ ! నాదొకమనవి.

పిట్టి : వాల ! వాలో ! ఏంది నీగోల !

ప్ర : గోలకాదు బాబూ ! క్షుద్బాధ.

పి : ఏటిక్కల్లే నీదొకబాస.

ప్ర : ఆకలిబాధ.

పి : అందమాదిరిసెప్పు. సుదబాదంటే నాకేం తెలుసుబుల్లోడా.

ప్ర : మూడు పూటలైంది అన్నంతిని బాబూ !

పి : వాలో ! మీాయయ్య మీాయమ్మ ఏమయ్యారు బుల్లోడా?

ప్ర : అదొక పెద్దగాథ.

పి : నీ కతేందో సెప్పిక్కల్లో ?

ప్ర : మానాన్న చాల ఆస్థిపరుడు.

పి : ఏం నిన్నెల్లగొట్టాడా ?

ప్ర : లేదులేదు నేనే వచ్చాను.

పి : ఏం కాసిని డబ్బులు తెచ్చుకోలా వత్తా ?

ప్ర : మూడు లక్షలు వ్రాసియిచ్చారు మానాన్న.
పి : పో పిల్లగోడ్తో నీమాట నమ్మొద్దు. మూడు లచ్చలే?
(ఆశ్చర్యంతో పాటపాడుతూ చిందులు త్రొక్కును)
ఓ - రామా నాయిక్కిల్లే - సీతనాసాగల్లే! యిక్కిరిక్కిరి గోవిందోహో (అని ఎటకారంగా పాడును)
ప్ర : లేదుబాబూ! దుర్వ్యాపారము వలన ఉన్నదంతా పోగొట్టాను.
పి : ఓడా సన్నాసి నాయాలు. ఆళ్ళేడదొరికారు నీకు. బలే సిత్రంగాఉంది బుల్లోడా! నీకు పిట్టనేమైనా అప్పసెప్పారా?
ప్ర : పిట్టంటే నాకర్థం కాలేదు.
పి : పిట్టంటె పిట్టే! మనకు తోడుంటుందే!
ప్ర : ఓహో! అమ్మాయా! దానికేం దానితోనే నామచ్చ మాపినారు.
పి : అద్దదీకత! పెంటి తగులుకుందంటే గుంజేస్తది బుల్లోడా? ఇంతకీ మీయయ్య దగ్గరికి ఎల్లకపోయావా?
ప్ర : మానాన్నగారి దగ్గరకు ఏముఖముపెట్టుకొని వెళ్ళను.
పి : అయినా ఏమాత్రం కాజేశారేంటి?
ప్ర : మొదటే చెప్పాను గదా? యీాడులక్షలని.
పి : నిజమే యిప్పుడు నమ్మాను నీమాట సత్తెంగ. ఎట్టా కాజేశారేంటి బుల్లోడా డబ్బులు?
ప్ర : ఒక వేశ్యదగ్గరకు తీసుకొనిపోయి అప్పగించారు.
పి . అయితే! అది సుక్కనేర్పిందా?
ప్ర : చుక్కంటే?

పి : అదే పెద్దమ్మోరు. పెబుత్తానికికూడా ఎదురు తిరిగింది సూడూ !

ప్ర : ఓహో ! సారాపానీయమా ?

పి : ఓ అద్గదే. మనోరు ఐదురూపాయల సెక్కుకి గలాసునీళ్ళకు అమ్ముడుపోతారే ఐదేళ్ళ కొకసారి అద్గదే.

ప్ర : అదేబాబూ ! నాకొంప ముంచింది.

పి : మరి యిప్పు డెట్టామరిశావు బుల్లోడా ?

ప్ర : ఏంచెయ్యను బాబూ ! కడుపే మాడుతుంటే పైగా దాని కెక్కడ డబ్బులు తేను.

పి : అయితే నువ్వింత సుకమారివే ఏంపనిచేత్తా ?

ప్ర : నాకు కాస్త కడుపులోకి అన్నంపెట్టు. నీవు ఏపనిచెబితే ఆపనిచేస్తాను.

పి : ఓ యిప్పుడు కరువొచ్చింది బుల్లోడా !

ప్ర : ఎందుకని బాబూ !

పి : ఎందుకేంది ? తిండిగింజలుఉన్నా వోళ్ళుదాసి ఏడిపిచ్చేది కాక ఐదారేళ్ళనుండి వరసాలే లేవు. ఈఏడు అసలే లేవు.

ప్ర : అందుకని ?

పి : రూపాయి పెడితే ఆలుమగలికి కడుపు నిండటంలే.

ప్ర : ఏమన్నా కానియ్యండి. మీరు చెప్పినట్లు వింటాను. కాస్తంత పనిచూపించి అంత అన్నము పెట్టండి.

పి : మరి మా పందుల్ని కాత్తావా ?

ప్ర : మహారాజులాగా కాస్తాను బాబూ !

పి : అంతేలే ! కడుపుమాడతుంటే ఏంచేత్తావు. ఇదిగో కఱ్ఱ రోజు పొద్దున్నే పెందలకడలే...పందుల్ని ఊరెలపలికి తోలుకుపో. అంత పొద్దెక్కాక తోలుకురా. కాత్తంత కుడితిపెట్టు. సాయంతరము యిదేపనిసేయి.

ప్ర : అలాగే చేస్తాను.

పి : కాని బుల్లోడా యిల్లు వదలి ఎటూపోవద్దు. తెలిసిందా ?

ప్ర : (దీనంగా) ఇప్పుడేమి చేయమంటావు బాబూ !

పి : చెప్పేది యినూ.

ప్ర : ఆ చెప్పండి వింటాను.

పి : ఇది బల్లపంది. దీనికి కోపంవస్తే రేసు.

ప్ర : ఏం చేయాలి ?

పి : చేతిలో కఱ్ఱుంది బుల్లోడా.

ప్ర : బాదమంటారా ?

పి : ఆ అంతేగా బుల్లోడా. ఇదిగో ఈతలపంది ఇది సూడిది జాగరత.

ప్ర : మరేం పరవాలేదు.

పి : ఇదిగో తౌడుబత్తా. కాత్తి కాత్తి యిదిలిచ్చి మొకాన పదిరోజు లొచ్చేటట్టు సూడు.

ప్ర : అలాగే జాగ్రత్తగా చూస్తాను.

పి : మరి నేను కొండకెల్లొత్తాను సుప్పాకి.

ప్ర : మీరు ఎక్కడికన్నా వెళ్ళండి నీని మంచిచేత్తలు నేను చూచుకొంటాను.

పి : పోతేపోయింది మనగాడి బుల్లోడు దొరికాడు.

(అని లోనికి పోవును)

ప్ర : ఆహాహా ! ఎంతటి వైపరీత్యము. లక్షాధికారి బిడ్డనై చివరకు బొక్కెడు మెతుకులు దొరక్క పందులుకాసే స్థితియా ? అయినా తప్పేనదేమున్నది ?

సీ॥ మెత్తని పాన్పుపై చిత్తముగలరీతి
పవళించియుంటిని పవలు రేలు
పరమాన్నములు మెక్కి పలుభంగులను నేను
కాలంబు గడిపితిన్ ఘనముగాను
విలువైన వలువలు వేలకొలది దాల్చి
'దర్జా'గ తిరిగితి తరుగులేక
అడిగిన అర్థికి అర్థంబునిచ్చితి
లేదనకుండగ పేదలనియు

ఆ॥ ఎండముఖముచూచి ఏనాడెఱుంగను
కష్టగాథలిట్లు కాంచలేదు
తుదకు మెతుకులేక తూలిపోవుచునుంటి
దిక్కెవండు నాకు దేవదేవ.

ఆహా ! ఎంతటి దీనస్థితి కలిగినది దేవా ! ఒక్కపొట్టను నింపుకొనుటకు బొక్కెడన్నములేక యీ నీచమైన పనికి యిష్టపడినను కడుపునిండకపోయె. ఈక్షుద్బాధ ఏవిధంగా తీరుతుంది. ఆహా ! దైవమా ఏమిచేతును కాదని దీనినికూడా కాలదన్నిపోయిన ఉన్న ఊపిరికాస్త ఊడిపోవుట ఖాయము

ఈ క్షుద్బాధ నేను భరింపలేను. ఏమైనను కానిమ్ము. ఈ పందులపొట్టు తినైనా పొట్టనింపుకొంటాను. (అని తౌడు బస్తాకడతినుటకు కూర్చుండి తిన మొదలుబెట్టగా పిట్టిచూచి)

పి : వాల! వాల! వాలో! ఏటెక్కిన్లే! చిట్టుతింటున్నావా? కడుపాత్రపు నాయలా! లే! లే! అంత ఆకలైతే ఆగడ్డి తినకపోయా (అని పళ్ళు నూరును)

ప్ర : ఆకలిబాధ ఏమిచేయను బాబూ!

పి : ఛీ! దయ్యిద్రపునాయాలకాన! ఈ కరువురోజుల్లో చిట్టు కొనలేక నేను చస్తుంటే గోత్రాలు గోత్రాలు నీకు సాలక పోయే (సావధానంగా) ఏమా! బత్తా వారం రాటంలేదని చూత్తున్నా! ఇంకానయ్యం. పెందలాడే సూశాను. లే ఎల్లిపో నాయింటోనుంచి.

ప్ర : అయ్యో! దైవమా! ఈకూడుకూడా పడిపోయినది. ఏమి చేతును.

పి : ఏట్టోపడిస్తావో! నాకొంపగుండ మేసి మరెల్తున్నావ్.

ప్ర : బాబూ! ఏదో ఒకపని చూచుకొనేవరకు నన్నిక్కడ ఉండనివ్వండి.

పి : యింకా నయ్యం. తినమరిగినకోడి యిల్లెక్కి కూసిందట నాయింటో షణం ఉంటానికి యీల్లేదు.

ప్ర : రెండురోజుల వ్యవధిచాలు.

పి : బుల్లోడా! నేను మరాదగా సెబుతున్నా ముందు కదులు తావా? కదలవా? (అని కర్ర ఎత్తును)

ప్ర : అలాగే వెళ్తాను. ఏమిచేస్తానులే !

పి : గంగలోదూకో! లోకానికి బరువన్నా తగ్గుద్ది. (అని లోనికి వెళ్ళును)

ప్ర : హా! పరాత్పరా! లోకేశా! దీనజనబాంధవా! నే జేసిన తప్పిదమునకు పందులు తినేపొట్టుకు ఆశించిననూ ఈ దీనుని పొట్ట పూడుటకు కావలసిన పొట్టుకూడా కరువై పోయినది నిజముగా నాతండ్రి విషయము పరికించిన ఎంత ఆశ్చర్యము గలుగునో వివరించలేను. తనకడ ఎంతమంది పరివారము పొట్టపోసికొనుచుందురో చెప్పలేను.

సీ॥ భూమి బ్రద్దలుచేసి భుక్తికై పోరాడి
పంటలు పండించు ప్రజలుగలరు
ఆయవ్యయములెల్ల అప్పజెప్పగ సదా
తెలివైన వారలు గలరుమాకు
పశువులన్ పోషించి పాలను పితుకంగ
పాలేరు లెందరో గ్రాలుచుంద్రు
జిహ్వాకింపు గలుగు సిస్సైన వంటలు
సిద్ధపరచునట్టి చెలులు గలరు

ఆ॥ దాసజనములెల్ల దండిగా భుజియింప
తగిన వసతులుండు తండ్రియింట
వెఱ్ఱితనముచేత వీథులపాలైతి
దుర్దినంబు లిట్లు దొర్లిరాగ.

నేను లేచి నా తండ్రిదగ్గరకు వెళ్ళి – తండ్రీ – నేను పరలోకమునకు విరోధముగాను నీ ఎదుట పాపముచేసితిని. ఇక

మీదట నీ కుమారుడ ననిపించుకొనుటకు యోగ్యుడను కాను. నన్ను నీ కూలివారిలో ఒకనిగా పెట్టుకొనమని తండ్రితో చెప్పకొందును. (అని లోనికి వెళ్ళును)

(రెండవ మార్గమున సుజనమూర్తి ప్రవేశించును)

సు : తనలోతాను) హా! పరాత్పరా! వసుధైక పరిపాలా! ఆపద్బాంధవా! పుత్రశోకమువలన నేను ఎంత క్రుంగికృశించి పోవలసివచ్చినది. ముక్కుపచ్చలారని తనయుడు తన కేదో చెడుదినములుకూడి యిల్లువిడిచి ఏ కానన కేగినాడో తెలియదు. నా జీవితమునకు యిక ఊరట కలుగుమార్గము లేదా? నీవు దయామయుండవు. కోరినవరముల నిచ్చువాడవు. నాకుమారుని తిరిగి అనుగ్రహించలేవా? ఏమి చేయను దైవమా? ఏమిచేయను?

ఉ॥ ఏలినవాడవు జగమేలెడి మానితసద్గుణుండ మా
పాలిట ప్రాణదాత పరిపాలన జేయవె భక్తగణంబులన్
కాలము తీరిపోయె కలకాలము నిల్వను పృథ్వియందు నీ
జాలినిచూపి నాయెడల చల్లగబంపుము పుత్రరత్నమున్.

ఎన్నో తపములు వ్రతములు సల్పి పుత్రద్వయంబును బడసితిమి గాని తండ్రీ! నాప్రాణముండగనే పుత్రుని ఎడబాటు నాకెంతయో వంతను గూర్చుచున్నది.

పాట

ఏదీగతినాకు - దేవదేవ - ఏదీగతినాకు
పాలలోముంచి నీడలోబెంచి - భాస్కరముఖము
కనబడకుండగ - ఘనముగ సాకితి నాప్రియతనయుని ॥ఏ॥

సౌ : (పాటముగియబోవుసరికి సౌజన్య లోపలనుండి రావలెను) సత్ప్రభూ! లోక మెటేంగిన మహానుభావులు. గతించిన దానికై చింతించుట పెద్దల లక్షణముగాదు. ప్రదీపు తప్పక తిరిగి రాగలడు. గాన చింతించవలదు.

సు : సౌజన్యా! నీనమ్మక మేమిటో నాకు బోధపడకయున్నది.

సౌ : ఔను ప్రభూ తప్పక ప్రదీపు రాగలడనియే నానమ్మకము

సు : నీ ఊహకు కారణ మేమిటి సౌజన్యా!

సౌ : నాకు స్వప్నములో ప్రదీపు తిరిగి వచ్చుచున్నట్లు సూచనలు కనిపించినవి.

సు : నీకలయొక్క తీరుతెన్ను లేమిటో కాస్త తెలియపలచి నా మనసు కూరట గలిగించుము

సౌ : వినండి మహాప్రభూ!

ఉ॥ ద్రోహులు చెంత చేరి కడుదొడ్డగ నెయ్యము సల్పివిత్తమున్
స్వాహాయొనర్చినట్లు కలచక్కగఁ గంటిని నిష్కళంకుడా!
ద్రోహులు దూరమాయెనట దుర్దశగల్గిన తక్షణంబునన్
ద్రోహముగు ర్తెటింగి బహుదుఃఖితుడై పడియుండెనొంటిగన్
ఆవిధంగా ముష్కరులు మోసగించ ప్రదీపు తలపోయిన వానివలె క్రుంగి కృశించినట్లు స్వప్నము గంటిని.

సు : ఔను సౌజన్యా! నేనునూ అనేక పర్యాయములు నా బిడ్డను స్వప్నములో చూచితిని. పీలికలు ధరించినట్లు, కడుపులోనికి పోయినట్లు జుట్టుపెరిగినట్లు అసహ్యాంగా కనిపించి నన్ను అనేకసారులు కలవరపరచి యున్నాడు.

సౌ : మహాప్రభూ! మన రెండుకలల భావము ఒక్కటిగానే కాన్పించుచున్నది. ప్రదీపుడు తప్పక కడగండ్లలో చిక్కుకొని యుండవచ్చును.

సు : ఔను. ఆపైకము యిష్టమువచ్చినట్లు ఖర్చుచేసియుండవచ్చును.

సౌ : చేతిలో పైకము లేనపుడు దిక్కుతోచదుగదా ?

సు : ఔను చేతిలో డబ్బులేనియెడల తిండి ఎవరు పెట్టెదరు.

సౌ : కాన ఆదశలో తండ్రిదగ్గరకు వెళ్ళవలెనని మనసు కలుగుతుంది.

సు : నిజమేనా సౌజన్యా! (ఉత్సాహమున)

సౌ : లేదుబాబూ! అలాఅనిభావము కలుగవచ్చునని నాఊహ

సు : (నిస్పృహాగా) అంతేనా సౌజన్యా ?

సౌ : ఔనుమరి తండ్రిని ఎదిరించి నాభాగము నేను చీల్చుకొని వచ్చానే ? తండ్రి దగ్గరకు ఏ ముఖముపెట్టుకొని వెళ్ళనా యని సంశయింపవచ్చును.

సు : సంశయముదేనికి ? సౌజన్యా ?

సౌ : కాదు సత్ప్రభూ! ఆయన మనోభావము అలాకలుగునేమో యని మీకు విన్నవించుచున్నాను. అష్టకష్టములకు గురియైతే మాత్రము తప్పక తిరిగి రాగలడు.

సు : సౌజన్యా! అట్లయిన నేనెంత ధన్యుడను.

సౌ : తప్పక రాగలడు నామాట విశ్వసించి నిశ్చలభక్తిని ధ్యానము సల్పుడు.

సు : (గద్గదకంఠముతో) సౌజన్యా! పుత్రుడు తిరిగి రాగలిగిన ఎన్ని ఉపవాస ప్రార్థనలైననూ చేయగలను. అసలు భూమి మీద బ్రతికియున్నాడో? లేదో ? ఆతనిని చూచుభాగ్యము నాకు దక్కగలదా ? అంతామిథ్య. భ్రమ. అయిననూ ఆ దైవమును ఆరాధించుట తప్ప యింక నేనేమి చేయగలను.

సౌ : (సుజనమూర్తి కన్నీటిని తుడిచి) ప్రేమమూర్తీ ! మీరు దుఃఖించి మీ శరీరమును శుష్కింప జేయుట ఆరోగ్యము నకు భంగము కలుగుటతప్ప మీరు సాధించునది లేదు. బ్రతికియుండి మంచికి ఎదురుచూచిన ఫలము కలుగగలదు. గాన ప్రార్థనా జీవితమును నిశ్చింతతో గడుపుటమంచిది.

సు : సౌజన్యా! అటులనే దైవధ్యానము సల్పుచూ యీ వృద్ధాప్యమును గడిపెదను. ఆయువున్న యెడల ఏనాటికైనా తిరిగి రాగలడనియే నావిశ్వాసము.

సౌ : అయ్యా! అంతటి ధృఢవిశ్వాసమున్న మనమెంతటి జటిల మైన కార్యమైనను సాధించగలము. కాన పట్టుదలతో ధ్యానముసల్పి తత్ఫలితము పొందమని నావిజ్ఞప్తి.

సు : అటులనే భక్తితో ధ్యానించెదను. దైవము నావిన్నపము ఆలకించకపోడు (అని లోనికివెళ్ళును) (ప్రదీపు చిక్కిన శరీ రము చిరిగినబట్టలు మాసినజుట్టుతో పాటపాడుచూవచ్చును)

పాట

ప్ర : ఏదీగతినాకు – దేవదేవ ॥ఏది

1. మూర్ఖుడనై నేను – మూర్ఖము జూపి
   నేనిటు చెరలో – బానిసనైతి ॥ఏది!

2. గడుసుగ మాటలు - పిడుగుల రీతి
వాడితి తండ్రిన్ - నడివీధిలోన ॥ఏది॥

ప్రాణము కడబట్టినది. మాతృభూమికి మరలుటచే మనసు ఉప్పొంగుచున్నది. ఆ కాన్పించు బంగారుహర్మ్యమే మేము నివసించు అపరస్వర్గము. మూర్ఖుడనై పెద్దలను తిరస్కరించి కడగండ్ల పాలైతిని. (సంశయము కలిగి) మూర్ఖుడనైన నన్నాగడప త్రొక్కనీయరు. అయినను తండ్రిగదా క్షమా పణ వేడెదను. నీపుత్రుడ ననిపించుటకు యోగ్యుడను కాను గాని నీపాలేళ్ళలో ఒకనిగా చూడమని వేడుకొందును. తప్పక క్షమించగలడు. కన్నతండ్రిగదా? (అనుచుండగా తండ్రి లోపలనుండి ఎదురుగా వచ్చును) (తండ్రిని చూచి) అదుగో నాతండ్రి (అనుమానముతో) ఆయనేనా? తప్పక మాతండ్రిగారే!

సు: (ఆశ్చర్యముతో) ఎవరిదా ఆ ఆకారము. ఎవరిదాకంఠ స్వరము. నాకుమారుడు ప్రదీపుడేనా? (కొంచెము ముందుకు వచ్చి చూచును)

ప్ర: నాన్నా! నేను దుర్మార్గుడను (అని పాదములపై బడును)

సు: (ఆతుర్దాగా) వత్సా! నీవటరా? (అని లేవనెత్తుచూ) సౌజన్యా! సౌజన్యా! నాబిడ్డ ప్రదీపు (అనిమెడపై బడును)

సౌ: (లోపలినుండివచి) సత్ హృదయా! మహాప్రభూ! ఏమి టదీ? (ఆశ్చర్యముగా) ప్రదీపా! ఎంత ఆశ్చర్యము ప్రదీపు బ్రతికి యున్నాడా?

ప్ర: (సౌజన్య పాదములపై బడి) మీయిరువురు నన్ను క్షమిం చండి నేను ద్రోహిని. అహంకారమున కన్నతండ్రికి దూర

మైతిని. నీకుమారుడ ననిపించుకొనుటకు యోగ్యుడను కాను అట్టి పితృద్రోహికి మీయింట నాకు స్థానములేదు. నా అహంకారము నన్ను ఎలా అణచివేసినదో వినండి,

సీ॥ దురితరూపుండనై దూరమైతిని తండ్రి
కడగండ్ల పాల్గాగ కలుషమతిని
పెద్దల సూక్తులన్ పెడచెవింబెట్టితి
మూర్ఖతవలన నపూర్వముగను
కుక్షింభరత్వాన కోర్కెలు మెండౌట
తెగనాడియుంటిని తెంపుజేసి
ఆకలిదప్పుల యవసరం బెఱుగక
అల్పంబుగా మాటలాడినాను

ఆ॥ ముందుచూపులేని మూర్ఖుండనై నేను
దుష్టబుద్ధివలన కష్టపడితి
తండ్రిబిడ్డలనెడి ధర్మంబు హాతమార్చ
తగిన శిక్షగలిగె తండ్రినాకు.

గాన తండ్రీ నన్ను క్షమించుము. (అని పాదములపై పడును)

సు : వత్సా! ఆఖరిఘడియలోనైనను తప్పు తెలిసికొంటివి ఇంత కన్నా నాకు కావలసిన ఆనంద మేమున్నది.

సౌ : సహృదయా! ఎంతటి విశాలస్వభావులు. ఎంత దాక్షిణ్య పరులు?

సు : నాకు కావలసినదేమున్నది సౌజన్యా! పోయిన రత్నము దొరికినది.

ప్ర : నన్ను మన్నించండి. నేను నీదాసుడను.

సు : బిడ్డా ! పొరబడుచుంటివి. నిన్ను చూచిన క్షణమునుండి నామనసెంత ఉల్లాసముగా నున్నదో చెప్పలేను. వినుము

సీ॥ పోయిన నాణ్యంబు పునికిపొందినరీతి
దక్కియుంటివి నీవు తనయ నేడు

కాదు. లంకెలబిందెలు లభ్యమైన పగిది
దక్కియుంటివి నేడు తనయనీవు

కాదు కాదు దృష్టిపోయినవాడు దృష్టిపొందినరీతి
తనయుడు కన్పింప తనువుపొంగె

అంతేకాదు. మరణించిన సుతుండు తిరిగి లేచినటుల
దక్కియుంటివి నీవు తనయ నేడు

ఆ॥ భక్తజనుల బ్రోచు పతిత పావనమూర్తి
దయకు నిలయమైన ధన్యమూర్తి
ఆప్తబాంధవునుని ఆధారభూతుని
మరువజాలనట్టి మాన్యునింక.

కాన సౌజన్యా ! నీవు వెంటనే యీసుతుడు నాకు దక్కినందుకు షడ్రసోపేతమైన విందు నేర్పాటుచేసి పేదసాదలకు అన్నదానము, తిరిగి దొరికిన నాతనయునకు నూతన వస్త్రములు బంగారు ఉంగరమును సిద్ధము చేయుము.

సౌ : అలానే మహాప్రభూ !

ఆ॥ దైవమిచ్చియుండె తగినంత ధనమును
కొదువలేదు మీకు సదయహృదయ
సిద్ధపరతునయ్య శీఘ్రమే భోజ్యముల్
జాగుసేయకుండ సక్రమముగ.

గాన అవశ్యమే అన్ని ఏర్పాట్లను గావించెదను (అనిలోనికి వెళ్లెను. ప్రదీప్ కూర్చునియుండవలెను.)

ధీరోదత్ : (రెండవ మార్గమునవచ్చి) ఏమిటి ఈవేడుకలు యీ విందులు ఈకోలాహలములు.

సు : వత్సా ! పోయిన ధనము దొరికినది. ఏ ప్రియధనమునకై జపించి తపించి నిద్రాహారములు మాని ఎదురుచూచితినో అట్టి విలువైన ధనము నాకు దొరికినది.

ధీ : నాయనా ! అటులైన మీరు చాల వలపక్షము చూపు చున్నారు.

సు : ఏమిటిబిడ్డా అది ?

ధీ : సీ॥ కష్టించి చెమటోడ్చి పుష్టిగా ధాన్యంబు
పండించి ఎంతయో ఫలముచూప
వ్యవసాయ మెంతయో వర్ధిల్లి యీనాడు
కళకళలాడుచు కలిమిపెరుగ
ఇంటిపనులనెల్ల ఎంతయో నేర్పుతో
బహుగాను చేయించి ప్రాకులాడ
ఇచ్చిపుచ్చుకొనుచు ఎదుటివారలతోడ
నేర్పుగా సఖ్యంబు నెఱపుచుండ
ఆ॥ ఇంతకాలమైన ఏనాడు నాకిట్టి
ఘనతకూర్చకుండ గడపినావు
దేశద్రిమ్మరిపుడు తిరిగి యింటికిరాగ
ఇట్టివేడ్క లేల యిపుడు మనకు.

సు : వత్సా ! పొరబడుచున్నావు. ఎప్పుడూ నీవు నాతో

ఉంటున్నావు అందువలన చేయవలసిన అవసరము లేక చేయలేదు.

ధీ : తండ్రీ! యిది ముమ్మాటికీ పక్షపాతము. తనఆస్తిని దుర్వ్యయముచేసి బికారియై వట్టిచేతులతో తిరిగివచ్చినవాని కోసమై యింతటి ఉత్సవమా?

సు : ఔను నాయనా! ఆనందమును పట్టలేక యిట్టి వేడుక చేయుచున్నాను.

ధీ : అలా డబ్బంతయు దుర్వినియోగము చేయుట నాకిష్టము లేదు. అందులో దుర్మార్గముగా ప్రవర్తించి చెడిపోయిగత్యంతరము లేక తిరిగివచ్చిన అక్కుపక్షికి యింతటి ఆర్భాటమా?

సు : అవును నాయనా! అదే పితృప్రేమకు నిదర్శనము. బిడ్డ తప్పు చేయవచ్చు తండ్రి క్షమించుట ధర్మము.

ధీ : ఈధర్మము మీకే చెల్లుబాటుగాని యితరు లెవ్వరూ పాటించరు నాయనా.

సు : లేదు కుమారా! నీవు పొరబడుచున్నావు.

ధీ : నేను పొరబడుటలేదు. పెత్తనము మీచేతిలో ఉన్నదని మీరు చెలాయించుచున్నారు.

సు : ధీరోదత్తా! మన దైవగ్రంథములోని సూక్తులను మరచి నట్లున్నావు నీవు నీఎదుటివానితప్పు క్షమించకున్న దైవము నీతప్పు క్షమించదు.

ధీ : అందువలన మీరు మీయిష్టము వచ్చినట్లు చేయుచున్నారు

సు : ఔను నాకు కలిగినంతవరకు నాహద్దులలోనే వ్యయపరచుచున్నాను.

ధీ : అయిన మీపక్షపాతపుబుద్ధికి యిది నిదర్శన మన్నమాట.

సు : ధీరోదత్తా! నీవుపొరబడుచున్నావు. తండ్రి బిడ్డనుక్షమింప కున్న పరలోకమందున్న మనతండ్రి నన్నేలాగు క్షమించును

ధీ : మీకానమ్మకమున్న నాఆస్థి నాకు విడగొట్టండి.

ప్ర : సోదరా! నన్ను క్షమించుము. ఆబుద్ధితక్కువపనిని నేను చేసే తుదకీ హీనస్థితికి వచ్చియుంటిని.

ధీ ! అయిననూ పరవాలేదు.

సు : ధీరోదత్తా! నీకు పిచ్చిపట్టినదా ఏమి ?

ప్ర : నాన్నా! నన్ను మాట్లాడ సెలవీయండి (సోదరునివైపు తిరిగి) సోదరా! నేను ఆస్థిని పంచుకొని ఏమేమో చేయ వలెనని కలలు కన్నాను.

ధీ : ఏమిటా ? కలలు ?

ప్ర : ధనముచేత పుచ్చుకొని ప్రపంచమంతయు చూచిరావలె నని ఆశపడితిని.

ధీ : ఏమీ చూడలేదా ?

ప్ర : లేదు లేదు! దుర్మార్గులు దారిలోనే తటస్థపడి నన్ను పెడ దారులు పట్టించి ధనమంతయు నాశనము చేసినారు.

ధీ : మనదగ్గర తెలివితేటలున్న ఏమీ భయముండదు.

సు : ఇంకా నయ్యము. దైవమిచ్చిన బలము గొప్పదిగాన ప్రాణ ములో తిరిగివచ్చినాడు. అది మన తండ్రి ఆశీర్వాదము.

ప్ర : కాన నన్ను మన్నించి నాన్నమాటకు ఎదురాడక కలిసి పోవుదము. నాచరిత్రవిరిగిన ప్రతిబిడ్డ తండ్రిమాటజవదాటడు

ధీ : జనదాటితే ?

ప్ర : నేను పడినపాట్లు పడకతప్పదు.

ధీ : ఏమిటా అగచాట్లు ?

ప్ర : చెప్పెదను వినుము.

సీ॥ పలుమారు మనయింట పరమాన్నమును మెక్కి
కాలంబు హాయిగ గడుపలేక
మెత్తని పాన్పుపై చిత్తమూరగఁ రేయి
పవళించి సుఖములు పడయలేక
విలువైన దుస్తులు పలుమారు ధరియించి
ఘనముగా కాలంబు గడుపలేక
విజ్ఞాన చిత్రాలు విరివిగా వీక్షించి
పొందుగ జ్ఞానంబు పొందలేక

ఆ॥ తండ్రి కెదురుతిరిగి ధనమును వెదజల్లి
చెడుగుచేసి నేను చెడితినిపుడు
బుద్ధివచ్చె నాకు పూర్తిగా యీనాడు
తూలనాడబోకు దురుసుగాను.

ప్ర : సోదరా ! నాబాధలు ఏమని చెప్పను. నేనున్నా దేశ ములో గొప్ప కరువు సంభవించినది.

ధీ : చేతిలో పైకము లేదా ?

ప్ర : ద్రోహులు నన్ను మాయజేసి పైకము ఎప్పుడో కాజేసి యున్నారు.

ధీ : అయితే ఎలా గడిపియున్నావు ?

ప్ర : అన్నమనునది దేశమున కరువైపోయినది.

ధీ : మరి అన్నము నీకెవరు పెట్టినారు ?

ప్ర : ఎవరి బ్రతుకు వారికే బరువైనది. ఎవరు మనలను చేర దీసి ఆదరించగలరు ?

ధీ : మరి ఏమితిని జీవించినట్లు ?

ప్ర : విధిలేక పందుల యజమానికడ పాలేరుగా కుదిరి వాడు పెట్టు చాలీచాలని అన్నముతో క్షుద్బాధకు తట్టుకొనలేక పోయినాను.

ధీ : అన్నము చాలనప్పుడు ?

ప్ర : ఆఖరుకు అన్నము చాలక క్షుద్బాధకు తట్టుకొనలేక పందులు తినే పొట్టు నీళ్లు కలిపి ముద్దలుచేసి మ్రింగి ఆకలి చంపుకొన్నాను.

ధీ ! అయ్యో ! తమ్ముడా ! ఎంత దుర్దశ ననుభవించితివిరా ! చివరకు ఎలా రాగలిగినావు ?

ప్ర : ఒకసారి యజమాని ఆపందులపొట్టు తినుటచూచి వెధవ పందులకు మేతపెట్టలేక నేను చస్తుంటే పొట్టంతా నీవే తింటున్నావా ? అని మెడపెట్టి గెంటినాడు.

ధీ : అయ్యయ్యో ! ఎంతధారుణము. తుదకు ఏమిజరిగినది ?

ప్ర : క్షణము నాయింట్లో ఉండుటకు వీలులేదని త్రోసివేయగా ఆబాధ సహించలేక నాతండ్రి దగ్గర అంతమంది పాలేళ్లు న్నారు. ఇక ఆయన కుమారుడననిపించుకొనుటకు యోగ్యు డనుకాను. మీ పాలేళ్ళలో ఒకపాలేరుగా పెట్టుకొనమని బ్రతిమాలిన చాలినంత తిండిదొరకక గలదని మనసుమార్చి వచ్చినందుకు తండ్రి తన పుత్రవాత్సల్యముచేత నన్ను కౌగ లించుకొని ఏడ్చి ముద్దాడినాడు.

ధీ : అయ్యో ! తమ్ముడా !

ఉ॥ కాలముమారి కష్టములు కాపురముండగ దైవమెంతయో
మేలొనరించె నీపగిది మేదిని తమ్ముని పక్షముండియున్
జాలియు ప్రేమచూపె మన చల్లని దేవుడు చింతమాన్పగన్
తూలియు మాటలాడితిని దుష్టుడనై నిను కావరంబునన్.

ఎంతటి దుర్దశ కలిగినదిరా నీకు (తండ్రివైపు తిరిగి) నాయనా! తమ్ముని కష్టగాథలు వినగా హృదయము నీరై పోయినది. నీవు తండ్రివి దయగలవాడవు. నేను మూర్ఖుడనై పితృ వాత్సల్యమును గుర్తించక నిన్ను ఎదురాడితిని. నన్ను క్షమించుము.

సు : వత్సా! నీ అన్యోన్యతకు నాకమందానందము కలుగు చున్నది. తండ్రికి అంతకన్నా కావలసిన భాగ్యమేమున్నది మనము ఒకరినొకరము ద్వేషించుకొనిన పరలోకమందున్న మనతండ్రి మనలను ద్వేషించును. మనము నీతిగా బ్రతికిన దైవమునకు మహాయిష్టము. అప్పుడే మనము మనతండ్రిని నిర్విఘ్నముగా చేరగలము.

ధీ : నాన్నా! ఇకమీదట మీ ఆజ్ఞానువర్తులమై మీఆజ్ఞను శిరసావహించి నడుచుకొందుము.

ప్ర : నాన్నా! అన్నయ్య నుడివినట్లు నేనును బుద్ధిగలిగి ప్రవర్తించెదను. మీవద్ద పోగొట్టుకొనిన స్వాస్థ్యమును తిరిగి పొందియున్నాను. నాజన్మ తరించినది.

సు : సౌజన్యా! విందుసిద్ధమైనదా ?

సా : (లోపలినుండి సౌజన్య వస్తూ ఉంగరము నూతనవస్త్రములు తెచ్చును) మహాప్రభూ! విందు సిద్ధముగానున్నది. ముందుబిడ్డకు ఉంగరము, నూతన వస్త్రములు ధరింపజేసి కార్యక్రమమును ప్రారంభించుదము.

సు : నత్నా! నాకెంతయో ఉల్లాసముగా నున్నది (అని ఉంగరము నూతనబట్టలు మేళతాళముల మధ్య ధరింపజేయును)

సభాసదులారా! ఇది పితృప్రేమకు నిదర్శనము లోకాంతమువరకు ఒక్కటే నా విన్నపము. తండ్రిబిడ్డలను ఏలాగున క్షమించునో! పరలోకమందున్న మనతండ్రియును మనపాపములను మనము ఒప్పుకొని పరిత్యజించినయెడల మనలను క్షమించి తప్పక తన రాజ్యములో చేర్చుకొనగలడు. అట్టి విశ్వాసముతో కక్షలు, కార్పణ్యములు, హత్యలు, దోపిడులు, పొరుగువారిని ద్వేషించుట. తల్లిదండ్రులను అవమానించుట, కులతత్వము అను దుష్క్రియలను మాని పశ్చాత్తాప హృదయముతో తండ్రి చెంతకు చేరమని నావిజ్ఞప్తి.

జనగణమన అధినాయక

తెర జారును.

